అంతర్జాతీయ తెలుగు మాసపత్రిక

సంపాదకుడు: కె.వి. గోవిందరావు



# విసదమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



## సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఎ., ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్‌సి.,

వి.బాలకుమార్ ఎమ్.ఎ., బి.ఎల్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఎ., బి.కాం., బి.ఎల్.

కె.వి.ఎస్.విజయకుమార్

కె.రత్నకుమారి



## చందా వివరాలు

జీవిత చందా.. . రూ॥ 350/-

3 సంవత్సరాల చందా రూ॥ 85/-

సంవత్సర చందా . రూ॥ 30/-

ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ॥ 125/-

సీ మెయిల్ (1 సం॥). రూ॥ 70/-

చందా పంపవలసిన చిరునామా



9, దేశికా రోడ్, మైలాపూర్

మద్రాసు-600004


## ఈ సంచికలో

జనవరి 1989

# విపుల

## అవార్డుల సభ

1988 డిసెంబరు, 15వ తేది
సాయంత్రం గం. 6-00 లకు

రాజా సీతై హాల్
మద్రాసు-600006.

అధ్యక్షులు:
తమిళనాడు హైకోర్టు న్యాయమూర్తి
**గౌ॥ కె. వెంకటస్వామి**

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కరణ:
**డా॥ లలితా కామేశ్వరన్**
వైస్ ఛాన్సలర్ (డా॥ ఎమ్.జి.ఆర్. మెడికల్ యూనివర్శిటీ)

(సలహా సంఘ సభ్యులచే విజేతలకు
'విపుల' అవార్డుల బహూకరణ)

## ధ్యానం

### స్వార్థం తెచ్చిపెట్టే అనర్థం




మానవులందరూ ఒకటే అనే మాట నిజమే. సామాన్య ధర్మాలతోబాటు విశేష ధర్మాలు కొన్ని ఉంటాయి. ఎవరి వ్యక్తిత్వం వారిది. ఎవరి భిన్నత్వం వారిది. ఒకరిని పోలిన మనిషి ఇంకొకడు ఉండటం అసంభవం. లోకంలో ఎవరు ఎలా మెలగుతున్నారనేదే ప్రశ్న.

ధనవంతులైనా, ధనహీనులైనా స్వార్థం తెచ్చిపెట్టే అనర్థం ఇద్దరికీ సమానమే. 'నాది' మీది మక్కువచేత ప్రపంచంలో అందరూ ఒకేవిధంగా పడరాని పాట్లు పడవలసి వస్తూంది. ప్రపంచాన్ని ఎవరూ వంచింపలేరు. సృష్టి మాయ అని దులుపుకుంటే పోయేది కాదు శ్రీమంతులకు వారి సమస్యలు వారికుంటే దరిద్రులకు వారి కష్టాలు వారికుంటాయి, 'ఇది నా ఇల్లు', 'ఇది నా డబ్బు' అని గిరి

(మిగతా 80 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### వ్యక్తి ప్రాముఖ్యం

నడుస్తున్న చరిత్రలో ఎంతోమంది స్త్రీలు, పురుషులు ఎన్ని లోపాలు ఉన్నా తమ జీవితాలను సమాజాభివృద్ధికి అర్పింతుకున్నారు. వారి దివ్య జీవితాదర్శాలు, వారి శక్తి సామర్థ్యాలు, వారి ధైర్యోత్సాహాలు చూచి ఇతరులు తలలు వంచవలసిందే.

ఒక మహోన్నత ఆదర్శ లక్ష్యంతో జీవిస్తే నీవు భూమిమీదే స్వర్గాన్ని నిర్మింతుకుంటావు. అప్పుడు నీ సాధన వికాసం పొందుతుంది. 'అందరికీ అన్నీ నీవే' అయిపోతావు.

సూక్ష్మాతి సూక్ష్మమైన ఇసుక రేణువులు చేరి సముద్రతీరం ఏర్పడుతుంది జల బిందువుల సమూహమే మహాసముద్రం. ఒక వాచిలో విడిభాగమైన హెయిర్ స్ప్రింగ్ కూడా మెయిన్ స్ప్రింగ్ అంత ముఖ్యమైనది.

ఒక పూలతోటలో వికసించిన చిన్న చిన్న పూవుల సువాసనలతో రాత్రి పిల్ల వాయువులు గుబాళిస్తాయి. ప్రతి చిన్న పువ్వు




"సహనం నుంచి లభించే ఫలాలు మధురంగా ఉంటాయి." — గాంధీజీ

మనోరంజకమైన సువాసనలను వెదజల్లి దానికి సహకరిస్తుంది.

తక్కువతనం ఎందుకు? బ్రహ్మాండంలో నేనొక చిన్న నలుసును. ఈ అనంతకోటి జీవరాసులలో నేనెక్కడ అనుకోకు. చిన్న మేకుకోసం నాడా పోయింది. నాడాకోసం గుర్రం పోయింది. గుర్రంకోసం యుద్ధంలో



ఓటమి కలిగింది అనే కథను జ్ఞాపకం పెట్టుకో. నీ ధర్మం ఏదైనా సరే, ప్రతి పని పరమాత్ముని ప్రణాళికానుబద్ధంగా చేస్తున్నావు. ఒక పెద్దగాలివచ్చి ధూళి,దుమ్ముకొట్టి ఎక్కడికో విసిరేసినట్లు భగవంతుడు నిన్ను లక్ష్యపెట్టటం లేదనుకోకు. భగవంతునిది అంతా దృష్టిమయమే లోకంలో ప్రతి వస్తువునీ, ప్రతిజీవునీ ఆ అనంతదృష్టితో ఎప్పటికప్పుడు కనిపెడుతూనే ఉంటాడు. భగవంతుని చూపుకి విభాగాలు లేవు. ఆయన చూపుకి ప్రతి జీవి ఒక లక్ష్యకేంద్రం. విశ్వాన్ని ఎంత సమగ్రంగా చూస్తున్నాడో నిన్నూ అంత సంపూర్ణంగా సదా దివ్యదృష్టితో కనిపెడుతూనే ఉంటాడు.

జీవించడానికి ధర్మం ఆచరించకు. ధర్మం ఆచరించడానికి జీవించు. జీవించడం కోసం జీవించకు. ఆసక్తితో జీవించు. విశ్వంలో ప్రతి జీవికి, ప్రతి అణువుకూ ప్రత్యేక స్థానముంది. ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. పైకి కనిపించే హెచ్చు తక్కువలు, అధిక్యతన్యూనతలు అన్నీ కృత్రిమాలు. భగవంతుడు సృష్టిలో సర్వం సమానం. ఒక్కసారి ఆలోచించు. నీవు ప్రపంచాన్ని మారుస్తున్నావా? లేక ప్రపంచం నిన్ను మారుస్తోందా? గతానుగతికంగా నిర్దేశించే కొలతలను, ప్రమాణాలను బట్టి నీ జీవనానికి విలువ కట్టుకోకు. నీ ప్రాముఖ్యం నీది.



"ఇతరులు చెప్పేదాంట్లో సత్యాన్ని గ్రహించడమే సద్బుద్ధి."

# సియోల్ ఒలింపిక్ క్రీడలు 1988

సెప్టెంబరు 17, 1988 వ యూరప్ మరియు లాటిన్ అమెరికాలో ప్రసిద్ధిపొందిన వోకల్ గ్రూప్‌వారు పాడిన 'హాండ్ ఇన్ హాండ్' అనే ఒలింపిక్ గీతంతో దక్షిణ కొరియా సియోల్‌లో 16 రోజుల పాటు జరిగిన 24 వ ఒలింపిక్ క్రీడల ప్రారంభో



త్సవం జరిగింది. ప్రారంభోత్సవంలో 13,740 గ్రూప్ డాన్సర్లు పాల్గొన్నారు. వేల కొద్దీ తెల్లపావురాలను ఎగురవేశారు.

80 మిలియన్ డాలర్ల ఖర్చుతో కూడిన ఈ ఉత్సవంలో కొరియా రిపబ్లిక్ ప్రెసిడెంట్ రొహ్‌టేవూ Roh Tae-woo) సియోల్ ఒలింపిక్ క్రీడలను ప్రారంభించాడు. సుమారు 73,000 ప్రేక్షకులు కన్నుల పండువుగా ఆనందించారు. దక్షిణ కొరియా అధ్యక్షుడు రోహ్, అంతర్జాతీయ క్రీడా సంఘ అధ్యక్షుడు జువాన్ అంటోనియో సమరాంచ్, సియోల్ ఒలింపిక్ నిర్వాహక సంఘ అధ్యక్షుడు పార్క్-సెతిక్ వంటి పెద్ద పెద్ద హేమాహేమీలు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. ప్రపంచంలో ప్రతీ దేశం నుంచి వచ్చిన క్రీడాకారులు మొత్తం 9627 మంది సమావేశమయ్యారు. 1988 సియోల్ ఒలింపిక్ క్రీడల ప్రారంభోత్సవంలో ముఖ్యమైన ఇవెంట్ స్కై-డైవింగ్ - 3,800 మీటర్ల ఎత్తుగా ఆకాశంలో ఎగురుతూన్న హెలికాప్టరునుంచి 40 మంది యోధులు పారాచూటులలో సియోల్ ఒలింపిక్ క్రీడా మైదానంలో నిర్ణయించిన కేంద్రాల దగ్గిర ఖచ్చితంగా దిగారు.



సియోల్ క్రీడలలో 160 దేశాలు పాల్గొన్నాయి. అత్యధికంగా 772 క్రీడాకారులు, వివిధ అధికారులు యునైటెడ్ స్టేట్స్‌నుంచి సియోల్‌కు వచ్చారు. తరువాత 655 మందితో సోవియెట్ యూనియన్ రెండవ స్థానాన్ని పొందింది.

సెప్టెంబరు 17 వ ప్రారంభమై అక్టోబరు 2 తో ముగిసిన ఈ క్రీడలలో సియోల్ క్రీడా మైదానాలలోను, మరియు దక్షిణ కొరి

"ధనాశాబద్ధుడైన మానవుడు ధర్మాన్ని త్యజిస్తున్నాడు."

మనోరంజకమైన సహవాసలను వెదజల్లడానికి సహకరిస్తుంది.

తక్కువతనం ఎందుకు? బ్రహ్మాండంలో నేనొక చిన్న నలుసును. ఈ అనంతకోటి జీవరాసులలో నేనెక్కడ అనుకోకు. చిన్న మేకుకోసం నాడా పోయింది. నాడాకోసం గుర్రం పోయింది. గుర్రంకోసం యుద్ధంలో



ఓటమి కలిగింది అనే కథను జ్ఞాపకం పెట్టుకో. నీ ధర్మం ఏదైనా సరే, ప్రతి పని పరమాత్ముని ప్రణాళికానుబద్ధంగా చేస్తున్నావు. ఒక పెద్దగాలివచ్చి ధూళి,దుమ్ముకొట్టి ఎక్కడికో విసిరేసినట్లు భగవంతుడు నిన్ను లక్ష్యపెట్టటం లేదనుకోకు. భగవంతునిది అంతా దృష్టిమయమే లోకంలో ప్రతి వస్తువునీ, ప్రతిజీవునీ ఆ అనంతదృష్టితో ఎప్పటికప్పుడు కనిపెడుతూనే ఉంటాడు. భగవంతుని చూపుకి విభాగాలు లేవు. ఆయన చూపుకి ప్రతి జీవి ఒక లక్ష్యకేంద్రం. విశ్వాన్ని ఎంత సమగ్రంగా చూస్తున్నాడో నిన్నూ అంత సంపూర్ణంగా సదా దివ్య దృష్టితో కనిపెడుతూనే ఉంటాడు.

జీవించడానికి ధర్మం ఆచరించకు. ధర్మం ఆచరించడానికి జీవించు. జీవించడం కోసం జీవించకు. ఆసక్తితో జీవించు. విశ్వంలో ప్రతి జీవికీ, ప్రతి అణువుకూ ప్రత్యేక స్థానముంది. ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. పైకి కనిపించే హెచ్చు తక్కువలు, అధిక్యత న్యూనతలు అన్నీ కృత్రిమాలు. భగవంతుడు సృష్టిలో సర్వం సమానం. ఒక్కసారి ఆలోచించు. నీవు ప్రపంచాన్ని మారుస్తున్నావా? లేక ప్రపంచం నిన్ను మారుస్తోందా? గతానుగతికంగా నిర్దేశించే కొలతలను, ప్రమాణాలను బట్టి నీ జీవనానికి విలువ కట్టుకోకు.. నీ ప్రాముఖ్యం నీది.



"ఇతరులు చెప్పేదాంట్లో సత్యాన్ని గ్రహించడమే సద్బుద్ధి."

# సియోల్ ఒలింపిక్ క్రీడలు 1988

సెప్టెంబరు 17, 1988 న యూరప్ మరియు లాటిన్ అమెరికాలో ప్రసిద్ధిపొందిన వోకల్ గ్రూప్‌వారు పాడిన 'హేండ్ ఇన్ హేండ్' అనే ఒలింపిక్ గీతంతో దక్షిణ కొరియా సియోల్‌లో 16 రోజుల పాటు జరిగిన 24 వ ఒలింపిక్ క్రీడల ప్రారంభో



త్సవం జరిగింది. ప్రారంభోత్సవంలో 13,740 గ్రూప్ డాన్సర్లు పాల్గొన్నారు. వేల కొద్దీ తెల్లపావురాలను ఎగురవేశారు.

80 మిలియన్ డాలర్ల ఖర్చుతో కూడిన ఈ ఉత్సవంలో కొరియా రిపబ్లిక్ ప్రెసిడెంట్ రోహ్‌టేవూ Roh Tae-woo) సియోల్ ఒలింపిక్ క్రీడలను ప్రారంభించారు. సుమారు 73,000 ప్రేక్షకులు కన్నుల పండువుగా ఆనందించారు. దక్షిణ కొరియా అధ్యక్షుడు రోహ్, అంతర్జాతీయ క్రీడా సంఘ అధ్యక్షుడు జువాన్ ఆంటోనియో సమరాంచ్, సియోల్ ఒలింపిక్ నిర్వాహక సంఘ అధ్యక్షుడు పార్క్-సెకిక్ వంటి పెద్ద పెద్ద హేమాహేమీలు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. ప్రపంచంలో ప్రతి దేశం నుంచి వచ్చిన క్రీడాకారులు మొత్తం 9627 మంది సమావేశమయ్యారు. 1988 సియోల్ ఒలింపిక్ క్రీడల ప్రారంభోత్సవంలో ముఖ్యమైన ఇవెంట్ స్కై-డైవింగ్ - 3,800 మీటర్ల ఎత్తుగా ఆకాశంలో ఎగురుతూన్న హెలికాప్టరునుంచి 40 మంది యోధులు పారాచూటులలో సియోల్ ఒలింపిక్ క్రీడా మైదానంలో నిర్ణయించిన కేంద్రాల దగ్గర ఖచ్చితంగా దిగారు.



సియోల్ క్రీడలలో 160 దేశాలు పాల్గొన్నాయి. అత్యధికంగా 772 క్రీడాకారులు, వివిధ అధికారులు యునైటెడ్ స్టేట్స్‌నుంచి సియోల్‌కు వచ్చారు. తరువాత 655 మందితో సోవియెట్ యూనియెన్ రెండవ స్థానాన్ని పొందింది.

సెప్టెంబరు 17 న ప్రారంభమై అక్టోబరు 2 తో ముగిసిన ఈ క్రీడలలో సియోల్ క్రీడా మైదానాలలోను, మరియు దక్షిణ కొరి

"ధనాశాబద్ధుడైన మానవుడు ధర్మాన్ని త్యజిస్తున్నాడు."

యాలో 4 ఇతర నగరాలలోను జరిగే 23 క్రీడలలో 237 స్వర్ణపతకాలను గెలుచుకో డానికి క్రీడాకారులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఇవేగాక టేక్ వాండో (Taekwondo), బేస్ బాల్ అనే రెండు ప్రత్యేక



డెమాన్‌స్ట్రేషన్ ఆటలు, బౌలింగ్, బాడ్మింటన్, మహిళల జూడో అనే మూడు ప్రదర్శన క్రీడలు కూడా జరిగాయి.

శాంతి ప్రగతులతో ఒలింపిక్ క్రీడల అభిమానాన్ని తెలియజేయడానికి మరియు సియోల్ ఒలింపిక్ క్రీడల జ్ఞాపకార్థం 1,65,000 చ. మీ. ల ఒలింపిక్ పార్కు నిర్మింపబడింది. ఈ పార్కులో ప్రపంచంలో ప్రఖ్యాత శిల్పకారులు రూపొందించిన శిల్పాలు ప్రదర్శింపబడతాయి. 80 దేశాలకు సంబంధించిన గొప్ప గొప్ప కళాఖండాలు ఇక్కడ ప్రదర్శింపబడతాయి.

సోవియట్ యూనియన్ ప్రపంచ క్రీడా రంగంలో తానే అగ్రగామి అని నిరూపించుకుంది. మొత్తం 55 స్వర్ణాలు, 31 రజతాలు, 46 కాంస్యాలతో రష్యా ఒలింపిక్స్‌లో ప్రథమస్థానం పొందింది. తూర్పు జర్మనీ 37 స్వర్ణాలు, 35 రజతాలు, 40 కాంస్యాలతో ద్వితీయస్థానాన్ని ఆక్రమించింది. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా 36 స్వర్ణాలు, 31 రజతాలు, 27 కాంస్యాలు గెలుచుకుంది. దక్షిణ కొరియా 12 స్వర్ణాలు, 10 రజతాలు, 11 కాంస్యాలు గెలుచుకుంది. సోవియట్ యూనియన్ 1952 లో జరిగిన హెల్‌సింకీ (Helsinki) ఒలింపిక్స్ నుంచి




ప్రతి ఒలింపిక్స్‌లోను సగటున 42.5 స్వర్ణాలు గెలుచుకుంది. యునైటెడ్ స్టేట్స్ 40.9 స్వర్ణాలు గెలుచుకుంది.

"విధి వక్రిస్తే కోటీశ్వరుడైనా భోగభాగ్యాలను అనుభవించ లేడు."

బల్గేరియాకు చెందిన క్రిస్టో మార్కోవ్ ట్రిపుల్ జంపులో 17.61 మీటర్లు గెంతి ఒలింపిక్ రికార్డును సృష్టించి స్వర్ణపతకాన్ని గెలుచుకున్నాడు. 82 కి.మీ. ల సైకిల్ పందెంలో హాలండ్‌కు చెందిన మోనిక్ క్నోల్ స్వర్ణపతకాన్ని గెలుచుకుంది ఈమె


OLYMPIC PARK, SEOUL

సగటు వేగం గంటకి 40.706 కిలోమీటర్లు.

ఒలింపిక్స్ పురుషుల ఎయిర్ రైఫిల్ క్రీడలో 695.6 పాయింట్లతో యుగోస్లేవియాకు చెందిన 25 సంవత్సరాల ఫిజికల్ ఎడ్యుకేషన్ ఉపాధ్యాయుడు గొరాన్ మాక్సిమోవిక్ విజయం సాధించాడు.

సోవియెట్ యూనియన్ మొత్తం 593.350 పాయింట్లతో ఒలింపిక్ పురుషుల జట్టు జిమ్నాస్టిక్ పందెంలో గెలుపొంది స్వర్ణపతకాన్ని గెలుచుకుంది. ఫెన్సింగ్ టోర్నమెంటులో ఇటలీకి చెందిన స్టెఫానో సెరియోనీ తూర్పు జర్మనీకి చెందిన యుడో వాగనర్‌ను 7 - 10 హిట్లతో ఓడించి మెన్స్ ఫాయిల్ గోల్డ్ మెడల్‌ను సాధించాడు. మహిళల హైబోర్డ్ డైవింగ్ పోటీలో అమెరికా మైకేల్ మిచెల్‌ను ఓడించి చైనా విద్యార్థిని క్సూ యన్‌మే (Xu Yanmei) ఆసియాదేశపు ప్రథమ స్వర్ణపతకాన్ని పొందింది. ఈమెకు 445.2 పాయింట్లు దక్కాయి.

పురుషుల బటర్‌ఫ్లై 100 మీటర్ల ఈత పందెం ఫైనల్స్‌లో సురినామ్‌కు చెందిన ఆంథోనీ నెస్టీ స్వర్ణపతకాన్ని అందుకున్నారు. ఇతడు 53.00 సెకండ్లతో ఒలింపిక్ రికార్డును సృష్టించాడు. అమెరికా దేశస్థుడైన మాట్ బియోండికంటే 1/100 సెకండ్లు ముందు వచ్చాడు. ఈత, క్రాస్ కంట్రీ రైడింగ్, రన్నింగ్, ఫెన్సింగ్ మరియు రివాల్వర్ షూటింగ్ చేరిన ఆధునిక పెంటథ్లాన్ (Pentathlon) క్రీడలో


OLYMPIC MONUMENT

5,404 పాయింట్లతో హంగేరీకి చెందిన 28 సంవత్సరాల జేనోస్ మార్టినెక్ అనే ఆటలు నేర్పే అధ్యాపకుడు స్వర్ణపతకాన్ని గెలుచుకున్నారు. తూర్పుజర్మనీకి చెందిన ఉల్ఫ్ టిమ్మర్‌మాన్ 22.47 విసురుతో షాట్‌పుట్ స్వర్ణపతకాన్ని గెలుచుకున్నారు. 8.72 మీటర్లు గెంతి లాంగ్ జంప్‌లో అమెరికాకు చెందిన కార్ల్ లూయిస్ స్వర్ణపతకాన్ని పొందాడు. ఒలింపిక్ చరిత్రలో లాంగ్ జంప్‌లో రెండుసార్లు స్వర్ణాన్ని పొందిన ప్రప్రథమ క్రీడాకారుడని గౌరవాన్ని పొందాడు.

పరుగుల పందెంలో 1 నిముషం 48.45 సెకండ్లలో 800 మీటర్లు పరుగెత్తి కెన్యాకు

"ఉత్సాహం, నమ్మకంతో పని చేసే మనిషి ఊటబావిలాంటి వాడు."

చెందిన 20 సంవత్సరాల పాల్ ఎరెంగ్ స్వర్ణాన్ని గెలుచుకున్నాడు. 10,000 మీటర్ల పందెంలో 27 నిమిషాల 21.46 సెకండ్లలో పరుగెత్తి మొరాకోకు చెందిన ఇబ్రహీమ్ బొత్రైబ్ స్వర్ణపతకాన్ని పొందాడు.

మహిళల జిమ్నాస్టిక్స్‌లో సోవియెట్ యూనియన్‌కు చెందిన 19 సంవత్సరాల ఎలెనాషుషునోవా 79.662 పాయింట్లతో స్వర్ణపతకాన్ని పొందింది.



AERIAL VIEW OF THE OLYMPIC PARK AND ATHLETES' AND PRESS VILLAGES

64 సంవత్సరాలకి పశ్చిమ జర్మనీకి చెందిన స్టెఫీగ్రాఫ్ టెన్నిస్ పందెంలో మొదటి ఒలింపిక్ మహిళా టెన్నిస్ చాంపియన్ అనిపించుకుంది. ఈమె అర్జెంటీనాకు చెందిన గాబ్రియేలా శబాటినీని 6-3, 6-3 తో ఓడించింది.

యు ఎస్. మహిళల బాస్కెట్‌బాల్ జట్టు 77-70 తో యుగోస్లేవియాను ఓడించి స్వర్ణ పతకాన్ని పొందింది మహిళల ఆర్చరీ టోర్నమెంటులో 352 పాయింట్లతో దక్షిణ కొరియాకు చెందిన కిమ్ సూనైయుంగ్ ప్రపంచరికార్డును సృష్టించింది మహిళల ఒలింపిక్ హాకీ పందెంలో దక్షిణ కొరియాను 2-0 తో ఓడించి ఆస్ట్రేలియా ప్రథమ స్థానాన్ని పొందింది.

న్యూజిలాండుకు చెందిన మార్క్‌టాడ్ 16 సంవత్సరాల వయస్సుగల ఛారిస్మా గుర్రంమీద స్వారీ చేసాడు. ఈక్వెస్ట్రియన్ పందెంలో స్వర్ణపతకాన్ని గెలుచుకున్నాడు. దోషరహితంగా మొత్తం 42 60 పాయింట్లతో జంపింగ్ పందెం గెలుచుకున్నాడు.

అమెరికాకు చెందిన జాకీ జోయినెర్ కెర్సీ 7 40 మీటర్లు గెంతి స్వర్ణపతకాన్ని అందుకున్నాడు మరో అమెరికా మహిళ ఫ్లొరెన్స్ గ్రిఫిత్ జోయినెర్ మహిళల 200 మీటర్ల పందాన్ని 21.34 సెకండ్లలో ముగించి ప్రపంచ రికార్డును స్థాపించింది.

పురుషుల హాకీ పందెంలో బ్రిటన్‌కి స్వర్ణం దక్కింది. సోవియెట్ యూనియన్ బ్రెజిల్‌ను 2-1 తో ఓడించి సోకర్ (Soccer) పందెంలో స్వర్ణపతకాన్ని గెలుచుకుంది.

తూర్పుజర్మనీ ఈతగత్తె క్రిస్టిన్ ఆటో ఒకే ఒలింపిక్స్ క్రీడల్లో 6 స్వర్ణపతకాలను పొందిన మొదటి మహిళ. ఈమెకు 11,000

(మిగతా 10 వ పేజీలో)

## అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా మిక్కిలి అధిక వేగంతో విహంగయానం

యుఎస్ఎలో నిర్మించబడిన లాక్‌హీడ్ ఎస్ ఆర్ - 71 'బ్లాక్‌బర్డ్' అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా 1 గం. 54 ని. 56.4 సె.లలో అతి వేగంగా విహంగయానం చేసి రికార్డు స్థాపించింది.

# మనపండుగలు - సంక్రాంతి

సీతా రవిచంద్రన్

తెలుగు పండుగలలో సంక్రాంతి పెద్ద పండుగ దీనినే సంక్రమణం అని కూడా అంటారు. నిజానికి సంక్రాంతే మనకు సంవత్సరాది పండుగ. పంటలు పండి ఇళ్ళకు చేరతాయి. చలికాలం వెనకబడుతుంది. ప్రకృతి రమణీయంగా ఉంటుంది. చెట్లు



ఆకులు రాల్చి క్రొత్త చిగుళ్ళు తొడుగుతాయి జీవితంలో క్రొత్త మార్పులు ఏర్పడతాయి అందుకే సంక్రాంతికి "సంకెళ్ళలో ఉన్నవారికి కూడా విముక్తి" అంటారు.

ఇది మార్గశిర పుష్యమాసాలలో వస్తుంది. అసలు సూర్యుడు ఒక రాశి నుంచి మరో రాశిలో ప్రవేశించడం సంక్రమణం. ఇటువంటి సంక్రమణాలు ఒక సంవత్సరంలో (12 రాశులు ఉన్నాయి కాబట్టి) 12 సార్లు వస్తాయి. కానీ సంక్రాంతి పండుగ వచ్చే మకర సంక్రాంతికే ఎక్కువ ప్రాముఖ్యత ఉంది.

సంక్రాంతి పండుగ వస్తుందనగానే ఊళ్ళో ప్రతీ ఇంట్లోను ఎంతో సంబరం. ఇళ్ళు శుభ్రంచేసి వెల్లలు వేయించుకుంటారు. గుమ్మాలకు పసుపు కుంకుమ పెట్టి ద్వారాలను మామిడి తోరణాలతో, బంతిపూవు దండలతో అలంకరించుకుంటారు. గదులు దులిపి అలికి శుభ్రం చేసుకుంటారు. కొత్త బట్టలు కుట్టించుకుంటారు. ఇళ్ళలో రకరకాల ముగ్గులు పెట్టుకుంటారు. ఊరంతా కళకళలాడుతూ ఉంటుంది.

ఈ నెల పూర్తి అయేటప్పటికి ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. కటక సంక్రమణం నుంచి మకర సంక్రమణం వరకు దక్షిణాయనం. ఉత్తరాయణం దేవతలకు పగలు. ఉత్తరాయణంలో మరణించిన వారికి ఉత్తమ లోకాలు లభిస్తాయని మన పూర్వుల నమ్మకం. భారత యుద్ధంలో దక్షిణాయనంలో పడిపోయిన భీష్ముడు ఉత్తరాయణం వరకు ప్రాణాలు బిగపెట్టుకుని ఉత్తరాయణం వచ్చిన తరువాత మరణిస్తాడు. ఈ ఉత్తరాయణ పుణ్యకాలంగురించి మన ధర్మశాస్త్రాలలో ఎక్కువగా చెప్పబడింది.

మనకు సంక్రాంతి మూడు రోజుల పండుగ. మొదటిది భోగి. రెండవది మకర సంక్రాంతి. మూడవది కనుమ. భోగిపండుగ నాడు వేకువ జామున లేచి స్నానాలు చేసి ఇళ్ళ ముందు పెద్ద పెద్ద మంటలు వేస్తారు. వీటినే భోగిమంటలు అంటారు. కొన్ని గ్రామాలలో అందరుచేరి ఒకేచోట ఆరుబయట భోగిమంట పెడతారు. ఇళ్ళలో పనికిరాని పాత వస్తువులు చెత్తా చెదారం కూడా ఈ మంటలో వేస్తారు 'భోగిపీడ' వదిలిందని సంతోషిస్తారు భోగినాడు

"మతము మానవుల కొరకే కానీ మానవులు మతము కొరకు కాదు."

పొంగలి వండుకుని తింటారు. సాయంకాలం స్త్రీలు పేరంటాలకు పిలుచుకుని పిల్లలకు భోగిపళ్ళు పోస్తారు. పిల్లలకు తలంట్లు పోసి కొత్తబట్టలు కట్టి పంచదార అచ్చులతో దండలు చేసి మెడలో వేసి సాయంకాలం హారతిచ్చి రేగుపళ్ళు చెరుకు ముక్కలు, చిల్లర కానులు తలపై పోస్తారు. శనగలు వాయినం ఇచ్చుకుంటారు.

రెండవరోజు పండుగ మకరసంక్రాంతి. లేదనకుండా ఈ రోజు దానాలు, ధర్మాలు చేస్తారు తియ్యగుమ్మడికాయకి చాలా



ప్రాధాన్యముంది. ఈ రోజున తియ్యగుమ్మడికాయ కూర వండుకుంటారు. రకరకాల పిండివంటలు చేసుకుంటారు. తియ్యగుమ్మడికాయ దానం ఇస్తారు. కొత్తబట్టలు కట్టుకుంటారు. చిన్నవారు పెద్దవారికి నమస్కారాలు చేసి ఆశీర్వాదం పొందుతారు. అందుకే దీనిని 'మొక్కుల పండుగ' అంటారు. కడిగిన తెల్లని నువ్వులు, బెల్లం, శనగపప్పు కలిపి ఇంటింటా పంచుకుంటారు. ఆడపిల్లలు రంగుల రంగుల పిడతలలో రేగుపళ్ళు, చెరకు ముక్కలు దక్షిణపెట్టి భోగిపిడతలు పంచుకుంటారు.

మూడవరోజు పండుగ కనుమ. ఇది ముఖ్యంగా రైతుల పండుగ. రైతులు పొద్దున్నే లేచి పశువుల దొడ్లు అలికి ముగ్గులు పెడతారు. ఇళ్ళముందు పాలతో పొంగలి వండుతారు. దీనినే 'పాలపొంగలి' అంటారు. పొంగలి నైవేద్యం చేసి ఆ మెతుకులు పసుపు కుంకుమ కలిపి పొలాల మీద 'పోలి' జల్లుతారు. ఆ తరువాత దిష్టి తీసి తెల్ల గుమ్మడికాయను పగులకొడతారు. వారి వారి పనిముట్లు తుడిచి శుభ్రంచేసి వాటిని పూజిస్తారు. పశువులను బాగా కడిగి కాళ్ళకు చిరుమువ్వలు గంటలు కట్టి కొమ్ములకు రంగులు వేసి బాగా ముస్తాబు చేసి ఊరమ్మట మేళ తాళాలతో ఊరేగించి ఇంటింటా బహుమానాలు పుచ్చుకుంటారు.

ఊరిబయట ఎడ్ల పందేలు, కోడిపందేలు, గొర్రె పందేలు, పొట్టేళ్ళ పందేలు వినోదంగా జరుపుకుంటారు. కనుమ తరువాత ముక్కనుమ కూడా కొంతమంది పశువుల పండుగ చేసుకుంటారు.

సంక్రాంతి పండుగ రోజులలో స్త్రీలు చేసుకునే గొబ్బి గౌరీవ్రతం చాలా ముఖ్యమైనది. ఇంట్లో మంటపం వేసి దాన్ని రకరకాల కూరగాయలతో, పువ్వులతో అలంకరించి మధ్య బియ్యంపోసి దానిమీద

( 8 వ పేజీ తరువాయి)

డాలర్లు ఖరీదుచేసే 20 కారట్ల బంగారు కిరీటం బహూకరించారు.

ముగింపు ఉత్సవం ఒలింపిక్ మైదానంలో అక్టోబరు 2 వ జరిగింది. సియోల్ మరియు బార్సిలోనా (స్పెయిన్)కు చెందిన డాన్స్ ట్రూపులు నృత్య ప్రదర్శన ఇచ్చారు. 1992 వేసవిలో బార్సిలోనా ఒలింపిక్ క్రీడలకు స్వాగతం ఇస్తుంది.

"ధర్మ సమ్మతమైనవని విశ్వసింపబడే వాటిని అన్నిటినీ ఆచరించు."

విగ్రహం పెట్టి పూజించి పాటలు పాడుకుంటారు. పేరంటాలు పిలుచుకుంటారు. గొబ్బి తడతారు. నాల్గవ రోజున ఉద్వాసన చేస్తారు. మంటపాన్ని అలంకరించిన కూరగాయలు వండుకు తింటారు ఈ గొబ్బి కూరతోపాటు పొంగలి తింటారు. సాయంకాలం గౌరీదేవిని, గొబ్బిదేవిని పిల్లలు, పెద్దలు అందరూ చేరి ఊరేగింపుతో బుక్కాలు చల్లుకుంటూ తీసుకువెళ్ళి నది



లోనో, చెరువులోనో ముంచుతారు. ఈ ఊరేగింపునే 'వాలాడింపు' అంటారు.

కొందరు భోగి మొదలు పదిరోజులు బొమ్మలకొలువు పెడతారు. ఇదే సంక్రాంతి కొలువు.

దక్షిణాదిని కూడా 'పొంగల్' చాలా ముఖ్యమైన పండుగ. పండుగ ఇంకా 15 రోజులు ఉండగానే పిల్లలు చిన్న చిన్న డప్పులు కొట్టుకుంటూ 'పొంగలో పొంగల్' అని కేకలు వేసుకుంటూ తిరుగుతారు. ఆరుబయట పొంగలి కొత్తకుండలలో వండి సూర్యునికి నైవేద్యం చేస్తారు. సాధారణంగా కొత్త బియ్యం, కొబ్బరికోరు. కొత్త బెల్లం, నెయ్యి పాలు ఉడకబెట్టి పొంగలి తయారు చేస్తారు. వీరు కూడా పంట కోతలు అయిన వెంటనే దీనిని ఆచరిస్తారు. పొంగలి తరువాతరోజు మాట్టుపొంగల్ అంటారు. ఆ రోజు వీరు పశువులను అలంకరించి ఇంటికి తీసుకువస్తారు. బహుమానాలు అందుకుంటారు. కొన్ని గ్రామాలలో పశువుల పందేలలాగ 'జల్లికట్టు' పశువుల పోట్లాట పెడతారు. పశువుల కొమ్ములకు డబ్బు పెట్టిన సంచి కడతారు. కొమ్ములు పట్టుకుని దాంతో పోరాడి విజయం పొందిన వీరుడు ఆ డబ్బు సంచిని తీసుకుంటాడు. దీని తరువాతి రోజును కరినాళ్ అంటారు. ఆ రోజు ఏ పనీ చేయరు. విశ్రాంతి తీసుకుంటారు. కొందరు ప్రక్క ప్రక్క గ్రామాలకు వెళ్ళి ధాన్యం అమ్ముకుని సంవత్సరానికి కావలసిన వస్తువులు, బట్టలు కొనుక్కుంటారు. ఆడపిల్లలు కుమ్మి కోలాటాలతో పాటలు పాడుకుంటారు. 'పొంగల్' సాధారణంగా జనవరి 14 న వస్తుంది.

## విస్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ అక్టోబరు '85; జనవరి '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87 నుంచీ డిసెంబరు '87; జనవరి '88 నుంచీ జూన్ '88 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీ వెల పై 0.75లు; 1984 కాపీల వెల రూ. 8.75 లు; 1985 కాపీల వెల రూ 11.50 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీల వెల రూ. 10.00 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5-00 లు చేర్చి M. O. పంపాలి. 'విస్డమ్', 9. దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

"మతమనేది మానవులు కల్పించుకున్నది."

# రిటైర్మెంటులో ఆరోగ్యరక్షణ

మానసికంగా మార్పు తెచ్చుకుంటేగానీ వృద్ధాప్యంలో ఆరోగ్యంగా ఉండలేరు. రిటైరైన తరువాత ఆరోగ్యంగా హాయిగా ఉండాలంటే మనోవైఖరి మార్చుకోవడం ముఖ్యం. దేహారోగ్యం చెడిపోవడానికి వృద్ధాప్యానికి ఏ విధమైన సంబంధమూ లేదు. వృద్ధాప్యం తెచ్చిపెట్టే రోగాలు అసలులేవు. ముందు చిన్నతనంనుంచీ శరీరంలో జీర్ణించిన రోగాలే వృద్ధాప్యంలో కనిపించేరోగాలు.



చిన్నప్పటినుంచీ ఏదో ఒక శరీరభాగం మీద ప్రయాసవల్లగానీ, పోషకాహార లోపంవల్లగానీ ఏర్పడ్డ రోగాలు వృద్ధాప్యంలో కనిపిస్తాయి. శరీరం నీరసించి లోపభూయిష్టమైన ఆహారంవల్ల ఆరోగ్యం హీనమైపోతుంది. సమతూకపు ఆహారం, సక్రమ మలమూత్ర విసర్జన, శారీరకంగా, మానసికంగా తగినంత విశ్రాంతి, సంతోషం ఆనందం ఉల్లాసం కలిగించే కార్యక్రమాలు చేపట్టడం, హాస్యతత్వం అలవాటు చేసుకోడం, ప్రతిదానికి ఉద్రేకం చెందిపోకుండా టెన్షన్ తగ్గించుకోవడంవల్ల కుటుంబంలోను, సమాజంలోను వివిధ వ్యక్తులతో పరస్పరం శ్రద్ధ భక్తి విశ్వాసాలు పెంపొందించుకోవడంవల్ల, ఒక పనిని సాధించడంలో గొప్పతనం పొందడంవల్ల, నిరంతరం వివేకాభివృద్ధికి తోడ్పడే గ్రంథాలు చదవడంవల్ల జీవిత ప్రమాణాన్ని పెంచుకోవచ్చు.

ఆహారం బాగా నమిలి తినాలి. జీర్ణప్రక్రియ నోటిలోనే ప్రారంభమవుతుంది. ఎక్కువ చల్లని పానీయాలు త్రాగవద్దు. చల్లని పదార్థాలు తినవద్దు అదే విధంగా ఎక్కువ వేడిగా ఉండే పానీయాలు త్రాగవద్దు. ఆహారం తిన్న తరువాత ఒక గంట దాకా నీళ్ళు త్రాగవద్దు. దీనివల్ల జఠరకోశంలో జీర్ణప్రక్రియకు అంతరాయం కలుగుతుంది. సాధారణమైన సౌమ్యమైన ఆహారం తినాలి బాగా వేగిన పదార్థాలు సులభంగా జీర్ణంకావు. ఆరోగ్యం నిలబెట్టుకోడానికి తగినంత మంచినీళ్లు విస్తారంగా త్రాగాలి.

ఆరోగ్యాన్ని చెడగొట్టే రెండు ముఖ్యమైన పదార్థాలు మైదాపిండి, పంచదార. ఇందులో ఏ ఒకటి ఉన్నా ఆరోగ్యానికి హానికరమే - రొట్టెలు, కేకులు, బిస్కెట్లు, స్వీట్లు. జాములు, స్ప్రింట్లు కోలాలు వగైరా అన్నీ వీటిలో చేరతాయి. క్రొవ్వు పదార్థాలు, కార్బొహైడ్రేటులు పోషకశక్తికి హానికరములు స్ట్రాంగ్‌టీ, కాఫీ చాక్లెట్లు, ఊరగాయలు, మసాలా పెట్టిన కూరలు ఎక్కువగా వాడకూడదు. 10 శాతం ప్రోటీనులు, 20 శాతం కార్బొహైడ్రేటులు. 5 శాతం క్రొవ్వు, 65 శాతం పళ్ళు కూర

“ముగింపని పని, జయింపబడని శత్రుసైన్యం నిప్పురవ్వతో సమానం.”

గాయలు చేరిన ఆహారం ఆదర్శవంతమైనది. ఆహారం ఎంత ప్రకృతిసిద్ధంగా ఉంటే అంతమంచిది. పొట్టుతీయని పప్పులు, తాజా పళ్ళు, పాలు ఆరోగ్యానికి మంచివి. ఆహారంలో కొంత పొట్టు ఉండేటట్టు ఉపయోగించడం ఎంతో మేలు. వృద్ధాప్యం శీఘ్రంగా ఏర్పడకుండా ఉండడానికి విటమిను E సహకరిస్తుందని పరిశోధకుల అభిప్రాయం. విటమిను E అధికంగా ఉన్న పదార్థాలు



తినడంవల్ల వయస్సును 10 సంవత్సరాలు వెనుకకు మళ్ళించుకోవచ్చు. 60 ఏళ్ళు వచ్చినా 50 ఏళ్ళ వారిలా ఉంటారు.

నానబెట్టిన మొలకెత్తే పచ్చిగింజలలో విటమిను E పుష్కలంగా ఉంటుంది. సాధారణంగా పెసలు శెనగలు నానబెట్టి మరునాడు మొలకెత్తినవాటిని పచ్చిగా తినాలి. బాదంపప్పులు, జీడిపప్పులు, ఆకు కూరలు వాడాలి. ఇటువంటి ఆహారంవల్ల వృద్ధాప్యం త్వరగారాదు. వారానికి ఒకసారో, రెండు సార్లో ఉపవాసం ముఖ్యం. క్రమబద్ధమైన ఉపవాసాలవల్ల అనేక జబ్బులు అతి అచ్చితంగా నయం అవుతాయి. వృద్ధాప్యంలో విధిగా ఆహారనియమం పాటిస్తూ సక్రమ ఉపవాసాలు చేస్తే శరీరానికి ఎంతో మేలు. శారీరక, మానసిక శక్తులను పొదుపుగా వాడుకుంటూ ఆహారనియమం, ఉపవాస క్రమం పాటిస్తే ఏ రోగం ఉండదు.

ముసలితనం ముంచుకురాకుండా ఆరోగ్యం నిలబెట్టుకుంటూ జీవించాలంటే సక్రమ వ్యాయామం ఎంతో అవసరం. సక్రమ వ్యాయామంవల్ల రక్త ప్రవాహం ప్రవృద్ధిపొందుతుంది ఊపిరితిత్తులు విస్తరించుకుంటాయి అధికంగా ప్రాణవాయువు లోపలకు చేరుతుంది. మంచి ఆకలి పుడుతుంది. ఊపిరితిత్తులద్వారా, చర్మంద్వారా, కిడ్నీలద్వారా, ప్రేగులద్వారా శరీరంలో వ్యర్థ పదార్థాలు విసర్జింపబడతాయి శారీరక శక్తి పెరుగుతుంది. మనస్సు ఉల్లాసంగా ఉంటుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఆత్మనిగ్రహం ఏర్పడుతుంది. యోగాసనాలు వేయవచ్చు. ఆయాస పడిపోకుండా ఉండే పడకను అభ్యాసం చేసుకోవచ్చు.

(మిగతా 65 వ పేజీలో)

## భవిష్యత్తుకు భగవంతునిదే భారం

ప్రస్తుతంతో ఎవరూ బాధపడిపోరు. వర్తమానంతో పాటు రాబోయే దాని గురించిన యోచనే మనిషిని క్రుంగదీస్తుంది. అనవసరమైన రేపు అనే బాధను తెచ్చిపెట్టుకోకు. ఒకవేళ భవిష్యత్తు భారంకూడా ఉంటే అది నువ్వు తెచ్చిపెట్టుకున్నదే గాని భగవంతుడు కల్పించినది కాదు. రాబోయే దాని సంగతి తనకు వదలిపెట్టమని భగవంతుడు విన్నవేడుకుంటాడు. —జార్జి మెక్‌డొనాల్డ్

# క్రీడా విషయాలు

## టెస్టు సీరీస్‌లో రికార్డు పరుగులు

1930 లో ఆస్ట్రేలియాకు ఇంగ్లండుకు మధ్య జరిగిన 5 టెస్టులలో డోనాల్డ్ బ్రాడ్ మన్ (ఆస్ట్రేలియా) 974 పరుగులతో రికార్డును స్థాపించాడు.

* * *

## టెన్నిస్‌లో 'లవ్'

టెన్నిస్ ఆటలో 'లవ్' అనే పదం



ఫ్రెంచి మాట లియోఫ్ (l'oeuf) అనే మాటనుంచి వచ్చింది అని అంటారు. దీనికి గ్రుడ్డు అని అర్థం.

* * *

## ఆధునిక ఒలింపిక్ క్రీడల సంస్థాపకుడు

బేరన్ పియరీ డి కౌబెర్టిన్ ఆధునిక ఒలింపిక్ క్రీడల సంస్థాపకుడుగా పరిగణింపబడు తున్నాడు.

* * *

## ఎవరెస్టు శిఖరాన్ని చేరిన మొదటి వ్యక్తి

1953 లో హిమాలయ పర్వతాలలో ఎవరెస్ట్ శిఖరాన్ని చేరిన మొట్టమొదటి పర్వతారోహకుడు న్యూజిలాండుకు చెందిన హిల్లారీ (Hillary).

* * *

## ఇంగ్లీషు చానల్‌ను ఈదిన మొదటి మహిళ

ఇంగ్లీషు ఛానల్‌ను ఈదిన మొట్టమొదటి మహిళ యు.ఎస్.ఎ కు చెందిన గెర్‌ట్రూడ్ ఇడెర్లీ (Gertrude Ederle).

* * *

## టెస్ట్ క్రికెట్‌లో హాట్‌ట్రిక్ చేసిన మొదటి ఆటగాడు

1878-79 లో జరిగిన టెస్ట్ క్రికెట్‌లో ఆస్ట్రేలియా క్రికెట్ ఆటగాడు ఎఫ్.ఆర్. స్పాఫోర్త్ (F.R. Spofforth) హాట్ ట్రిక్ చేసిన మొట్టమొదటి ఆటగాడు.

## ఇరాన్ నూనెమీది ఆదాయం 50 శాతం పోరాటానికే

ఇరాన్ నూనెమీద పొందుతూన్న మొత్తం ఆదాయంలో 50 శాతంఅంటే 15.9 బిలియను పౌండ్లు ఇరాక్‌పై యుద్ధానికి వినియోగిస్తూంది.

"నానాత్వం లేనిదే బ్రతుకే లేదు."

# యోచనాశక్తి

డా॥ హరిలాల్ భిఖా

మానవుని మనస్సు ఎంతో అద్భుతమైనది. దీని ప్రవర్తనాశక్తి అమోఘం అనంతం. మనమంతా ఆలోచించడానికి, నేర్చుకోడానికి, ఒక కార్యం సాధించడానికి, జీవితంలో సంభవించే వివిధ సంఘటనలను ప్రత్యక్షంగా అనుభవించడానికి మనస్సును వినియోగించు



కుంటాము. మహామహా లందరూ తమ లక్ష్యాన్ని సాధించడానికి ఇతోధికంగా కృషి చేస్తూ, తమ మానసికశక్తిని విజయవంతంగా ఉపయోగించుకున్న వారే.

మనస్సు అంటే ఏమిటి? శరీరంలో ప్రతీ అంగాన్ని నియంత్రిస్తూ ఆయా భాగాలు తమ తమ పనులను నెరవేర్చడానికి సహకరించే యోచనలు ఉద్భవించే ముఖ్య మనో వ్యాపార కేంద్రము మనస్సు. యోచనలు అతివేగంగా ఉద్భవిస్తూంటాయి. స్విచ్ వేసిన వెంటనే బల్బు వెలుగుతుంది. యోచనలు ఇంతకంటే వేగంగా బయలుదేరి అతి విస్తృతంగా - శీఘ్రంగా ప్రభవిస్తాయి.

యోచనల స్వభావాన్ని బట్టి నైజాన్ని బట్టి మన శరీరం మనస్సు నిర్ణయించబడతాయి ఆనందదాయకమైన మంచి యోచనలు శరీరంలో నాడీ మరియు ఎండోక్రైన్ విధానాలను సక్రమంగా ప్రసరింపజేస్తాయి. శరీరాంగాలు సామర్థ్యవంతంగా పని చేస్తాయి. ప్రతీ కణం చైతన్యంతో తెలివిగా సూక్ష్మజ్ఞానంతో మనస్సు ఇచ్చే ఆదేశాలను వెను వెంటనే అనుసరిస్తుంది. యోచనలు సరళవంతంగా ఉంటే మనస్సులో కణాలు మంచి కుటుంబంలో పిల్లలులాగా ప్రవృద్ధిపొందుతూంటాయి. యోచనలకు తగిన ప్రవర్తనలు ప్రభవిస్తూంటాయి. ఇది మన ఆరోగ్యానికి మిక్కిలి ప్రాధాన్యమైనది చెడ్డ యోచనల వల్ల కలిగే దుష్ఫలితాలు, మనోవికారాలు మరియు మంచి యోచనలవల్ల కలిగే సత్ఫలితాలను మనం తెలుసుకో గలుగుతాము.

మనస్సులో దురాలోచనల దుష్ఫలితాలను తెలుసుకోడానికి ఊపిరి వదిలినప్పుడు వచ్చే ఊపిరిని ఒక చల్లని గాజుపలకమీద పరీక్షింపజేసారు. పరీక్షింపబడిన ఊపిరిలో వివిధ వర్ణముల కణాలు కనిపించాయి. వీటిని సంగ్రహించి జంతువుల శరీరంలోకి ఇంజక్షన్‌ద్వారా ప్రవేశపెట్టినప్పుడు వాటిలో ఇటువంటి భావోద్రేకాలు ఉద్భవించాయి. ఒక కుటుంబంలో అకస్మాత్తుగా మరణవార్తను విన్న వ్యక్తి భయపడతాడు. మనోవైకల్యం పొంది విచారిస్తాడు. ఏకాగ్రత ఉండదు. గుండెపోటు కూడా సంభవించవచ్చు. నరాల బలహీనత ఏర్పడుతుంది. కాబట్టి మనోవైఖరివల్ల శరీర వ్యాపారం మారుతుంది అని తెలుసుకోగలుగుతున్నాము.

"మానవుడు సంసారంలో ఉన్నా సంసారం తనలో ఉండకూడదు."

ఋణాత్మకమైన యోచనలు, నిరాశాభావాలు చాలాకాలం మనస్సులో ఉంచే శరీర వ్యాపారాలు పూర్తిగా మారిపోతాయి. దీనివల్ల ఇతర రోగాలు సంభవిస్తాయి. నరాలు ఉద్రేకం చెందడం, నరాల బిగి, గుండెపోటు, ఉబ్బసం, మధుమేహం, అజీర్ణం, నపుంసకత్వం వంటి వివిధ రోగాలు సంభవిస్తాయి. శరీరంలో వివిధ కండరాలు కుదించుకుపోతాయి. ముఖంమీద ముడతలు బయలుదేరతాయి. ఒత్తిడి అధికం అవుతున్నకొద్దీ, నరాలబిగి పెరుగుతున్న కొద్దీ శరీరంలో వివిధ భాగాలు స్థానభ్రంశం చెంది తమ తమ వ్యాపారాలు కొనసాగించలేకపోతాయి.

యోచనలు ఒక మనిషినుండి మరో మనిషిమీద అతి సులభంగా ప్రభవిస్తాయి. కోపం, అహంకారం, అసూయ. ద్వేషం, ఓర్వలేనితనం, దుఃఖం మొదలైనవి పరిసరాలను కాలుష్యం చేస్తాయి. దీనివల్ల ఇతరులకు అపకారం కలుగుతుంది. ఇదే మనోభావంగల వ్యక్తులు అతిసులభంగా ఈ కాలుష్యానికి గురి అవుతారు. సామర్థ్యవంతమైన మంచి యోచనలు మానవునిమీద ప్రభవిస్తాయి. కాబట్టి ఒకరు ప్రవృద్ధి చేసుకునే స్నేహస్వభావం చాలా ముఖ్యం.

మనోభావాలకు సంకల్పశక్తికి గల సంబంధమేమిటి? సంకల్పశక్తి మానసిక శక్తి ఇది ఒకే భావంవల్ల అభివృద్ధిపొందుతుంది. ఆరోగ్యాన్ని నిలబెట్టుకుని అనేక రోగాలను కుదుర్చుకోడానికి కూడా సంకల్పశక్తి సహకరిస్తుంది.

మనస్సును ఆరోగ్యవంతంగా దృఢంగా ఉంచుకోడానికి కొన్ని సలహాలు· మనస్సులో ఉత్సాహపూరితమైన ధనభావాలను పెంచుకో. ఇటువంటి భావాలను ఇతరుల మీద ప్రభవింపజేయి. మనిషి తను భావించినట్లే అవుతాడు. ఈ దివ్యసూత్రాన్ని జీవితాంతం జ్ఞాపకం పెట్టుకో. ఆత్మవిశ్వాసం పెంపొందించుకో. శాంతస్వభావం, అనురాగం అలవరచుకో. ఆనందంగా పాడుకుంటూ నవ్వగలిగితే మనస్సులో నిరాశాభావాలు పుట్టవు. ధైర్యం, ఉత్సాహం, సౌశీల్యం, మంచి స్నేహం వృద్ధిపొందే వాతావరణాన్ని కలిగించుకో. ధనాత్మకమైన ఉత్సాహాన్ని పెంచుకుంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ఆరోగ్యవంతమైన శరీరానికి రోగాలు ఉండవు.

—'యోగా' సౌజన్యంతో

## అన్ని శరీర వ్యాపారాలకు మెదడే ముఖ్యము



అన్ని శరీర వ్యాపారాలకు కేంద్రమైన మెదడులో 1,000 మిలియను నాడీకణాలు ఉన్నాయి.

"ఏ విషయమైనా అలవాటుగా మారితే వ్యసనం అవుతుంది."

# ఉక్కంత కాఠిన్యం పువ్వంత మార్దవం

జి. ఎమ్. జగతియాని

స్వామీ వివేకానందుని చిత్రాలు సాధారణంగా రెండు మిక్కిలి ప్రసిద్ధమైనవి. ఒకటి చికాగో పోజులో ఉన్న చిత్రం. ఇందులో వివేకానందుడు గంభీరంగా నీ


SWAMI VIVEKANANDA

కళ్ళలోకి చూస్తూ సవాలు చేస్తూన్నట్టు ఛాతీ మీద చేతులు కట్టుకుని ఉంటాడు రెండవది ధ్యానావస్థలో ఉన్న చిత్రం. కళ్ళు మూసుకుని, కాళ్లు ముడుచుకుని బాసంపట్టి కూర్చుని చేతిలో చెయ్యి పెట్టుకున్న చిత్రం

మొదటి చిత్రంలో వివేకానందుడు గొప్ప బలవంతుడుగా గర్జిస్తున్నసింహంలా ఉంటాడు. రెండవదాంట్లో అతి సౌమ్యంగా నిశ్చలంగా శాంతంగా ప్రేమానురాగాలతో కనిపిస్తాడు.

నిత్యజీవితంలో సంభవించే ప్రమాదాలను, ఆపదలను, అఘాతాలను తట్టుకోడానికి మానవునికి ఉక్కువంటి బలం అవసరం. సంకోచం లేకుండా ధైర్యంగా వీటిని ఎదుర్కోవాలి. మానవుడు ఈ లక్ష్యం వైపు మరణానికి కూడా లెక్కచేయకుండా ముందుముందుకి పయనించాలి.

మానవునికి దయామయమైన హృదయం కూడా ఉండాలి. దారిలోపడిన పువ్వుని చూడకుండా తొక్కినప్పుడు హృదయం కరిగి రక్తం స్రవించాలి. దారిద్ర్యంతో పతితులైన దీనాతిదీనులను ఆదుకోవాలి. వారికి సేవ చేయాలి. వారి కష్టాలను పంచుకోవాలి.


Swami Vivekananda

ఇటువంటివారే నిజమైన మనిషి ఇటువంటి వారు దైవాంశ సంభూతులని మన గ్రంథాలు తెలియజేస్తున్నాయి. నిజమైన ధైర్యవంతుడే నిష్కాపట్యంగా ఉండగలడు. సింహం ధైర్యం గల జంతువు. నక్కకు ధైర్యం లేదు. బలవంతుడైనా రాక్షస హృదయం కలవారు చిరకాలం జీవించలేరు. వీరు అమాయకుల రక్తంతో భూమిని తడుపుతారు. తగిన ప్రతిఫలాన్ని అనుభవిస్తారు. ఇదే ప్రకృతి ధర్మం.

—'ఐడియాస్ ఎక్చేంజి' సౌజన్యంతో

"మతి కుదిరినచోట మందు శక్తిని చేకూర్చుచున్నది."

# ఆరోగ్యానికి సూచనలు

రాత్రి కిటికీ తలుపులు పూర్తిగా తెరచి ఉంచాలి. ప్రొద్దున్నే లేచిన తరువాత లోపలకు బాగా ఊపిరి పీల్చుకోవాలి. చలిగాలి, ఈదురుగాలి తగలకుండా చూచుకోవాలి ప్రతిరోజూ సక్రమంగా వ్యాయామం చేయాలి తేమగా ఉండే ప్రదేశాలలో నివసించకూడదు. ప్రతిరోజూ సక్రమంగా ఆహారం బాగా నమిలి తినాలి.



సాధారణంగా మీరు నివసించే ఇండ్లలో ఈగలు, దోమలు, దుమ్ము మీకు హాని కలిగించే శత్రువులు. ముఖ్యంగా మంచి గాలి, సూర్యరశ్మి తగిలేటట్టుగా చూసుకోవాలి. తాజా కూరగాయలు, పళ్ళు ప్రతిరోజూ తినడం చాలా ఆరోగ్యకరం. అజాగ్రత్తవల్ల అనారోగ్యం సంభవిస్తుంది. మితిమీరి తినవద్దు. ఆరోగ్యానికి హానికరం కలిగించే పొగ కాల్చవద్దు. మాదక ద్రవ్యాలు ఉపయోగించవద్దు. మత్తు పానీయాలు త్రాగవద్దు.

ఎప్పుడూ మీరు కట్టుకునే బట్టలు, శరీరం శుభ్రంగా ఉంచుకోవాలి. ఇంట్లో సందులలో మట్టి చేరకుండా చూచుకోవాలి. ప్రతిదినం కాల విరేచనం అయేటట్టు జాగ్రత్తపడాలి.

విరేచనాల మందులు అలవాటు చేసుకోవద్దు. వృద్ధులు, చంటిపిల్లలు ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. వారు పుష్టికరమైన సాత్విక ఆహారం సక్రమంగా తింటూండాలి. మంచి విశ్రాంతి వారికి ఎంతో అవసరం. శుభ్రమైన గాలి కూడా కావాలి. సక్రమ జీవనమే మన ప్రతిజ్ఞా వాక్యము కావాలి. అదే మన ధ్యేయం. నీ శరీరం నీ ఆత్మలాగే పవిత్రమైనది. ఆరోగ్యమే మహాభాగ్యం అని నమ్ము. సకాలంలో వైద్య సహాయం తీసుకుంటూ ఆరోగ్యం కాపాడుకుంటూంటే అమూల్యమైన ప్రాణం రక్షించుకోగలుగుతావు.

మీకు భగవంతుడు విచక్షణా బుద్ధి ప్రసాదించాడు. దానిని ఉపయోగించుకునే విధానం మీలో ఉంది. సంతోషంగా పనిచేయవలసినప్పుడు పనిచేస్తూ, నిద్రపోవలసి వచ్చినప్పుడు నిద్రపోతూ ఏకాలానికి తగిన పనిని ఆ కాలంలో చేసుకోవాలి. ఆరోగ్యం లేకపోతే అంతా శూన్యమే!

## 1990 లో ఆసియా క్రీడలకు మాస్కాటు

1990లో బీజింగ్ (చైనా)లో నిర్వహించబడే 11వ ఆసియా క్రీడలకు మాస్కాటు (Mascot)గా ఎన్నుకున్న అపురూపమైన పాండాకు 'పాన్‌పాన్' (pan pan) అని నామకరణం చేశారు.

"వాంఛను విడిచిపెట్టవలెను వాంఛను కోరవలెను."

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## ఆత్మ స్వభావం

ఒక ఊరిలో ఒక గొప్ప శాస్త్రీకుడు నివసిస్తూండేవాడు. ఇతడు గొప్ప విద్వాంసుడు. సంస్కృతంలో అపార పాండిత్యం కలవాడు. అతడికి ఒక్కడే కొడుకు. కొడుకు పెరిగి పెద్దవాడవుతున్నాడు. పది సంవత్సరాలు నిండాయి. ప్రారంభ విద్య ముగిసింది. కుమారునికి సంస్కృతం నేర్పిస్తున్నాడు. దాంతోపాటే ఆత్మబోధ కూడా చేయడం ప్రారంభించాడు. ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మంగా ఉంటుంది కనిపించనట్టుగా ఉంటూ విశ్వవ్యాపకమై ఉంటుంది అన్నాడు.

కుమారునికి సంశయం తీరక ఆత్మ సూక్ష్మంగా ఎలా ఉంది? అని ప్రశ్నించాడు.

తండ్రి పుత్రునికి ఆత్మస్వరూపాన్ని గురించి వివరిస్తూ 'అదిగో చూడు నాయనా! ఆ మర్రిచెట్టు దగ్గరకు వెళ్ళి దాని పండు ఒకటి తీసుకురా' అన్నాడు. కుమారుడు వెళ్ళి ఆ పండును తీసుకు వచ్చాడు ఆ పండును రెండు ముక్కలుచేసి అందులో ఉండే ఒక గింజను కూడా రెండు భాగాలు చేయమన్నాడు. పుత్రుడు అలాగే చేసాడు. తండ్రి ఒక గింజ ముక్కను తీసి కొడుకు చేతిలో పెట్టి 'ఇందులో ఏం చూస్తున్నావు' అని అడిగాడు. కొడుకు బాగా పరిశీలించి 'అందులో ఏం కనిపించడం లేదు' అన్నాడు.

'నిజమే ఈ గింజలో ఏం కనిపించడం లేదు. అయినా ఈ గింజని భూమిలో పాతిపెడితే దీంట్లోంచి మొక్క బయలుదేరి పెరిగి పెద్దవృక్ష మవుతుంది. అలాగే ఆత్మ అతి సూక్ష్మంగా ఉండి సృష్టికి కారణమవుతుంది. వృక్షం పెరుగుదల గింజపైనే ఆధారపడి ఉన్నట్లు ఆత్మ సూక్ష్మరూపంమీదే

## ఎలక్ట్రిక్ ఈల్ 650 వోల్టుల విద్యుత్‌ను ప్రసరింపజేస్తుంది




సుమారు 10 అడుగుల పొడవు గలిగి 90 పౌండ్లు తూగే ఎలక్ట్రిక్ ఈల్ 1 ఆంపియర్‌కి 650 వోల్టుల విద్యుత్ శక్తితో షాక్ కొడుతుంది. 20 అడుగుల దూరంలో ఉన్న మనిషిని చంపడానికి ఇది చాలు. ఇవి దక్షిణ అమెరికాలో బ్రెజిల్, కొలంబియా మరియు పెరూ నదులలో నివసిస్తాయి.

"ఒక సద్భావన సుమపరిమళంలా అల్లుకుపోతుంది." —గాంధీజీ

ఈ అనంతవిశ్వం ఆధారపడి ఉంది' అని వివరించి చెప్పారు.

'ఆత్మ విశ్వమంతా వ్యాపించి ఉంది అన్నారే అది ఎలా సాధ్యం' అని సంశయంతో పుత్రుడు తిరిగి తండ్రిని 'అయితే ఆత్మ ఎట్లా వ్యాపకత్వం పొంది ఉంది?' అని అడిగాడు.

ఒక చెంబులో నీరు, ఒక ఉప్పు పొట్లం తీసుకు రమ్మని చెప్పి ఆ నీటిలో ఉప్పును వేసి కలపమన్నారు. కొడుకు తండ్రి చెప్పినట్లు చేసాడు.

'ఇప్పుడు చెంబులో పైపైన నీటిని కొద్దిగా త్రాగు' అన్నారు. కొడుకు నీళ్ళు రుచిచూచి అసహ్యించుకున్నాడు. నీళ్ళు ఎలా ఉన్నాయని తండ్రి ప్రశ్నించాడు. కొడుకు ఉప్పగా ఉన్నాయని చెప్పగా సరే మంచిది, పైనీళ్ళు పారబోసి చెంబులో మధ్య ఉన్న నీటిని త్రాగు అన్నాడు. పుత్రుడు తాగి అవీ ఉప్పగానే ఉన్నట్టు గ్రహించాడు. తిరిగి వాటిని పారబోసి అడుగున మిగిలిన నీటిని త్రాగాడు. అవీ ఉప్పగానే ఉన్నాయి. 'ఉప్పు ప్రత్యేకంగా కనిపించకపోయినా పూర్తిగా నీటిలో కలిసిపోయి నీరు అంతా ఉప్పగానే ఉంటుంది. అలాగే ఆత్మ ఈ ప్రపంచంలో అంతా కలిసిపోయి ఉంటుంది. చూద్దామంటే విశ్వవ్యాపకత్వం తెలియకపోవచ్చు. అది నీటిలో కరిగిన ఉప్పులాగే అనుభవంవల్ల తెలుస్తుంది' అని తండ్రి ఆత్మస్వరూపాన్ని వివరంగా చెప్పారు.

ప్రత్యక్ష అనుభవంద్వారా తండ్రివద్ద కుమారుడు ఆత్మయొక్క సూక్ష్మత్వాన్ని, వ్యాపకత్వాన్ని తెలుసుకున్నాడు. కొడుకు సంశయం తీరింది.

## యుఎస్ఏలో 3,500 రోబోటులు పనిచేస్తున్నాయి




నేడు రోబోట్స్ పెరిగిపోయి పారిశ్రామిక రోబోట్లు అభివృద్ధిపొందాయి. యుఎస్ఎలో సుమారు 3,500 రోబోట్లు విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నాయి. జనరల్ మోటార్స్, ఫోర్డు, క్రిస్లర్, హోండా మరియు ఫియట్ వంటి పెద్ద పెద్ద ఆటోమొబయిల్ ఉత్పత్తిదారుల వద్ద మరియు వెస్టింగ్ హౌస్, జనరల్ ఎలక్ట్రిక్ మరియు టెక్సాస్ ఇన్‌స్ట్రుమెంట్స్ వంటి కంపెనీలలోను ఇవి ఎక్కువగా ఉన్నాయి. ఇవి విస్తృతశ్రేణిలో అనేక పనులు చేస్తాయి. ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి బరువంతమైన భాగాలను చేరవేయడం, కారుబాడీల వెల్డింగ్, పెయింటింగ్ చేయడం, రేడియోలకు ఎలక్ట్రానిక్ విడిభాగాలను సమకూర్చడం వంటి నానారకాల పనులను ఇవి చేస్తాయి.

—రోబోట్స్ రీల్ టు రియల్ లై
బార్బరా క్రాస్నాక్

"సంహారంకన్నా సంస్కారం మిన్న."

# సరసోక్తులు

## బుద్ధి కుశలతకు పరీక్ష

తెలివి లేనివారితో ఎదుర్కోగల సామర్థ్యమే బుద్ధికుశలతకు సునిశితమైన పరీక్ష.

* * *

## ఆదర్శ కుటుంబంలో మహిళ మూలరాయి

సహధర్మచారిణి, సుగుణవతి అయినప్పుడు దారిద్ర్యమునకు తావులేదు. సుగుణ



సంపన్న కానప్పుడు ధనరాసులుండి ప్రయోజనం లేదు. సచ్ఛీల రూపం సతీతిలకము కంటే సౌందర్యవంతమైన పదార్థం లేదు. తన శీలాన్ని సంరక్షించుకుంటూ ప్రేమార్ద్ర నయనాలతో భర్తను చూస్తూ, ఆదాయాన్ని అనుసరించి వ్యయముచేయు గృహిణియే సహధర్మచారిణి. తన పతియే దైవమని భావించే స్త్రీ 'కురియుము' అన్నచో వర్షం కురుస్తుంది. సత్సంతానమును బడసిన సాధ్వి దేవలోకమున ఉన్నత స్థానాన్ని పొందుతుంది.

* * *

## ఇంగ్లండులో మొట్టమొదటి జాతీయ పురావస్తుశాల

ఇంగ్లండులో మొట్టమొదటి జాతీయ పురావస్తుశాల 'ది బ్రిటిష్ మ్యూజియం' 1753 వ సం.లో తెరవబడింది. మొదటి రోజులలో దీనిని చూడాలంటే అనుమతి కోసం 2 వారాలపాటు కాచుకుని ఉండవలసి వచ్చేది.

## భారతదేశంలో కూలీలకు అనుమతింపబడ్డ భారం 135 కి.గ్రా. లు

ఒక పెద్ద మగకూలీ అత్యధికం 55 కి.గ్రా.లు మోయవచ్చని 1967 లో ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్‌వారు నిర్ణయించారు. కాని మన దేశంలో కూలీలు 135 కి.గ్రా. వరకు బరువు మోయవచ్చని అనుమతించబడింది. నౌకానిర్మాణ సంస్థలలో మాత్రం కూలీలకు 100 కి.గ్రా. పరిమితి ఉంది.

—'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

"కాలంతో అనుబంధం లేనిది శాశ్వతం."

సగటున!

ఒకడు ఒక కాలు వేడిగ మండుతున్న స్టౌమీద మరోకాలుని చల్లని ఫ్రీజర్ మీద పెట్టి నుంచుంటే స్టాటిస్టిషియనులు ఇతడు సగటున హాయిగా ఉన్నాడని లెక్కకడతారు.

*　*　*

అందుకే నేను మానేశాను

సిగరెట్లు కాల్చడం వల్ల కలిగే అనర్థాలను గురించి మొన్న చదివాను. అందుకే నేను చదవటం మానేసాను.

*　*　*

రెంటిని చూసి వ్రాస్తే పరిశోధన

విద్యను గురించి చెప్పుకుంటున్నప్పుడు- ఒక గ్రంథాన్ని చూసి వ్రాస్తే 'అది గ్రంథ చౌర్యం' అంటారు. రెండింటిని చూసి వ్రాస్తే అది పరిశోధన అనిపించుకుంటుంది.

*　*　*

జుట్టు - జుట్టు సింగారం

యౌవ్వనంలో ఉన్నప్పుడు కాలానికి అనుగుణ్యంగా నీ జుట్టును అలంకరించుకుంటావు. వృద్ధాప్యంలో నీ తలపై జుట్టుకి తగినట్టుగా సింగారం సరిపెట్టుకుంటావు.

*　*　*

అవివేకులు వివేకుల విజయాన్ని అంగీకరించరు

అవివేకులు వివేకులనుంచి కంటే వివేకులు అవివేకుల నుండి ఎక్కువ లాభాన్ని పొందుతారు వివేకులు అవివేకుల పొరపాట్ల నుంచి దూరంగా తప్పుకుంటారు. కానీ అవివేకులు వివేకుల విజయాన్ని అనుకరించరు.

—మార్కస్ కాటో

## సామాన్య రోగాలు



| రోగం | శరీరభాగం |
|---|---|
| ఫైలేరియా | కాళ్ళు |
| రాబీస్ | మెదడు |
| స్కర్వీ | చర్మము మరియు రక్తము |
| న్యుమోనియా | ఊపిరితిత్తులు |
| గాస్ట్రైటిస్ | జఠరకోశం |
| గాయిటర్ | థైరాయిడ్ గ్రంథి |
| ఎగ్జిమా | చర్మము |
| ఆస్మా | గుండె |
| అపెండిసైటిస్ | అపెండిక్స్ వాపు |
| డయాబిటిస్ | పాంక్రియాస్ |
| జాండీస్ (కామెర్లు) | కళ్ళు, కాలేయము |
| పోలియో | నాడీమండలం |
| రికెట్లు | పసిపిల్లల ఎముకలు, కీళ్ళు |
| ఎల్లోఫీవర్ | రక్తము |
| టైఫాయిడ్ | ప్రేగులు |
| ట్రాకోమా | కళ్ళు |

"సగం సగం చేసేపని కాలీకాలని రొట్టెవంటిది." —గాంధీజీ

# అవార్డులు

## 1988 ఒనాసిస్ అవార్డు

సుప్రసిద్ధ సినీమానటి ఎలిజబెత్ టేలర్‌కి, ప్రపంచ బ్యాంకు మాజీ అధ్యక్షుడు రాబర్ట్ మెక్



ELIZABETH TAYLOR

నమారాకు మరియు రెండు ఇతర సంస్థలకు 1988 వ సంవత్సరపు ఒనాసిస్ అవార్డులు ఇవ్వబడ్డాయి. పరిసర మానవ హక్కులు మరియు పాండిత్య విభాగాలలో ప్రసిద్ధి పొందిన వారిని ఈ అవార్డులతో గౌరవిస్తారు.

## శాంతి పాంచాల్‌కి జాన్‌ప్లేయర్ పోర్ట్రెయిట్ అవార్డు

శాంతి పాంచాల్ అనే భారతీయ చిత్రకారుడు చిత్రించిన ఒక భారతీయ కుటుంబం లండన్ జీవితం – 'లివింగ్ ఏన్ ఇండియన్ లైఫ్ ఇన్ లండన్' అనే చిత్రానికి జాన్ ప్లేయర్ పోర్ట్రెయిట్ అవార్డు లభించింది.

## భయపడితే 'గూస్' అంటారు

ఆంగ్ల భాషలో జంతు సంబంధమైన పదాలు అనేకం వాడతారు. పని సరిగా చేయనివాడిని 'బ్లాక్‌షీప్' అంటారు. స్వార్థపరాయణుడిని 'డాగ్ ఇన్ ది మేంజర్' (గడ్డి తొట్టెలో కుక్క) అంటారు. ఒకరి నైపుణ్యం తెలియనప్పుడు 'డార్క్ హార్స్' అంటారు. చీటికిమాటికి భయపడేవారిని 'గూస్' అంటారు. ఒక వ్యక్తి క్రమక్రమంగా చెడిపోతుంటే 'గోయింగ్ టు డాగ్స్' అంటారు.

# ఎలా?

## మెదడు ఎలా పనిచేస్తుంది?

ఎవరైనా సూదితో గుచ్చితే వెంటనే కేకవేస్తావు. గుచ్చడం, నీవు 'అహా' అని అనడం మధ్య వ్యవధిలో 'స్పర్శ' జ్ఞానం 'అనుభవాన్ని' మెదడుకి ప్రవహింప చేస్తుంది. ఇది అకస్మాత్తుగా సంభవించిన బాధ అని నిర్ణయిస్తుంది. వెంటనే ఊపిరి కండరాలకు మాట్లాడే శక్తి గల వాక్ ఇంద్రియానికి వార్తలు పంపుతుంది. నీవు అహా! అని కేక వేస్తావు.

"లేనిదాని కొరకు ఆశించేది దుఃఖం.
ఉన్నది చాలనుకునేది సుఖం."

—అమ్మ

## మిక్కిలి శ్రద్ధగా నిర్వహింపబడిన వైల్డ్ లైఫ్ రిజర్వుకి అవార్డు

హంగూల్ (కాశ్మీరీ జింక) నివసించే శ్రీనగర్‌లో జమ్ము మరియు కాశ్మీర్‌లో డాచిగమ్ నేషనల్ పార్కును శ్రద్ధగా నిర్వహిస్తున్నందుకు రూ. 2.58 లక్షల జాతీయ బహుమానం ఇవ్వబడింది

## ఫిల్మ్స్ డివిజన్ డాక్యుమెంటరీ చిత్రానికి వెండికప్పు

ఇటలీ ట్యూరిన్‌లో నిర్వహింపబడిన 42వ అంతర్జాతీయ క్రీడల ఫిల్మ్ ఉత్సవంలో శ్రీ సి.ఎల్. కౌల్ డైరక్టు చేసిన 'హై ఎడ్వంచర్ ఆన్ వైట్ వాటర్స్' అనే డాక్యుమెంటరీ చిత్రానికి వెండికప్పు అవార్డు లభించింది.

## డా॥ ఎమ్. ఎస్. స్వామినాథన్‌కి 'గోల్డెన్ హార్ట్' ప్రెసిడెన్షియల్ అవార్డు

ఫిలిప్పైన్స్ మరియు ప్రపంచ వ్యవసాయ విజ్ఞానానికి సహకరించిన ఫిలిప్పైన్స్ మనిలాలో ఇంటర్నేషనల్ రైస్ రీసెర్చి ఇన్స్టిట్యూటు డైరెక్టర్ జనరల్ డా॥ ఎమ్.ఎస్. స్వామినాథన్‌కి గోల్డెన్ హార్ట్ ప్రెసిడెన్షియల్ అవార్డు బహూకరించబడింది.

## ఎందుకు?

### మర్రిచెట్టు కొమ్మలు కాండంచుట్టూ ఎందుకు బయలు దేరతాయి ?



BANYAN TREE

బ్రహ్మాండమైన వృక్షం మర్రిచెట్టుకి కొమ్మలు కాండంచుట్టూ అన్నివైపులా పెరుగుతాయి. బోదె చాలా పెద్దదైనా ఈ కొమ్మల భారాన్ని అది మోయలేదు. కాబట్టి లావుపాటి వ్రేళ్ళు కొమ్మల క్రిందిభాగం నుండి బయలుదేరతాయి. ఇవి తిన్నగా భూమిలోకి తన్నుతాయి. ఈ వేళ్ళు దిట్టంగా పాతుకున్న తరువాత ఇవి చెట్టుకు ఆసరాగా ఉండి పోషణను అందిస్తాయి. ఏళ్ళు గడిచిన కొద్దీ ఇవి పాత బోదెచుట్టూ కాండాలుగా మారతాయి. దీనివల్ల మర్రిచెట్టు విశాలంగా పెరుగుతుంది.

"మహాత్ముల కోపం క్షణికం అయితే, నీచుల కోపం కలకాలం ఉంటుంది."

# సముద్రపు రాకాసులు

సీటా ఎడ్విన్

తిమింగిలాల చరిత్ర 70 మిలియన సంవత్సరాల మిక్కిలి పురాతనమైనది. ఇవి ఒకప్పుడు భూమి మీద నివసించేవి. క్రమక్రమంగా ఇవి నీటిలో చేరి ఆ పరిసరాలకు అనుగుణ్యంగా మార్పులు పొంది సము


WHALE

ద్రపు నీటిలో జీవిస్తున్నాయి. ముఖ్యంగా అక్కడ అధికంగా వీటికి శత్రువుల బెడద ఉండదు. ఆహారం సులభంగా లభిస్తుంది. అందుకే ఇవి నీటిలో నివాస మేర్పరచుకున్నాయి.

తిమింగిలాల ముందుకాళ్ళు నీటిలో ఈదడానికి వీలుగా తెడ్లుగా మార్పు చెందాయి. వెనుకకాళ్ళు పూర్తిగా హరించిపోయాయి. అడుగుభాగంలో వీటి చిహ్నాలు ఇంకా కనిపిస్తాయి. తిమింగిలాల శరీరంపైన దట్టమైన ఉన్ని ఉండేది. కాని ఇప్పుడు అది క్రొవ్వులా మారి పొరలు పొరలుగా పేరుకుంది. దీనివల్లే ఇవి మిక్కిలి శీతలమైన సముద్రాలలో కూడా జీవించగలుగుతున్నాయి.

ఈ పరిసరానుగుణ్యతలే గాక క్రమక్రమంగా వీటి దవడలు ప్రవృద్ధి పొందాయి. దవడల నిర్మాణాన్ని బట్టి తిమింగిలాలను రెండు జాతులుగా విభజించవచ్చు. దంతములు గలవి, దంతములు లేనివి. దంతములు గల తిమింగిలాలలో పళ్ళు ఒకే ఆకారంలో ఉంటాయి. పళ్ళు లేని తిమింగలాలకు నోటిలో పై దవడ నుంచి క్రిందికి జల్లెళ్ళవంటి వడపోత సాధనాలు ఏర్పడి ఉంటాయి. వీటిద్వారా నీటిలో నివసించే చిన్న చిన్న జంతువులను సులభంగా జారిపోకుండా పట్టి తింటాయి.

వీటి తలపై గల రంధ్రం (Blow hole) ద్వారా ఊపిరి పీల్చుకోడానికి ఇవి నీటిపైకి వస్తూంటాయి. ఒకసారి ఊపిరి తీసుకుంటే నీలితిమింగిలం (Blue whale) నీటి అడుగున 50 నిమిషాలవరకు ఉండగలదు. ఊపిరి తీసుకోడానికి, వదలడానికి రెండు సెకండ్ల కాలం అవుతుంది. ఇవి ఊపిరి వదలినప్పుడు 90 శాతం గాలి పైకి వస్తుంది. పెద్ద శబ్దంతో గాలి వదలబడుతుంది. ఇది నీటి పైతలం మీద బుడగలుగా కనిపిస్తుంది. తిమింగిలాలు కిచ కిచ ధ్వనులతో ఈలలతో పరస్పరం మాట్లాడుకుంటాయి. గూని వీపుగల పెద్ద మగజాతి తిమింగిలం 30 నిమిషాలపాటు విడవకుండా కూస్తుంది. ఫిన్ తిమింగిలాల మూలుగులు దూరంగా తిమింగిలాలకు వినిపిస్తుంది.

నోటిలో పళ్ళులేని వడపోత సాధనాలు గల తిమింగిలాలు సాధారణంగా జత కూడే

"ఇతరుల తప్పులను ప్రకటించేవాడు తన తప్పులను తానే ప్రకటించుకున్నట్లు అవుతుంది."

టప్పుడు తప్ప ఎప్పుడూ ఒంటరిగా ఉంటాయి. పళ్ళుండే తిమింగలాలు గుంపులు గుంపులుగా జీవిస్తాయి.

తిమింగిలాలు పుట్టేప్పుడు మొట్టమొదట తోక బయటకు వస్తుంది. ఇతర జంతువులలో తల ముందుకు వస్తుంది. ఇవి పుట్టి పుట్టడంతో ఊపిరి పీలుస్తాయి. తిమింగిలాలు నీటిలో జన్మిస్తాయి. ఇవి పుట్టేటప్పుడు వెనుక భాగం ముందుకు వస్తుంది. లేకపోతే ఇవి నీటిలో మునిగిపోతాయి. పుట్టీ పుట్టడంతోటే ఊపిరి తీసుకోడానికి చిన్న తిమింగిలాన్ని తల్లి తిమింగిలం గానీ, ఇతర సహాయక తిమింగిలాలు గానీ నీటి ఉపరితలానికి ఎత్తుతాయి.

తిమింగిలాలు సాధారణంగా 1.25 మీటర్ల నుండి 33 మీటర్ల పొడవు, 23 కి.గ్రా.ల నుండి 1.36.000 కి గ్రా. ల భారం ఉంటాయి. ఒక పెద్ద బ్లూ తిమింగిలం సుమారు 25 ఏనుగులు లేక 1,600 మనుష్యుల మొత్తం భారం ఉంటుంది. బ్లూ తిమింగిలం పిల్ల పుట్టినప్పుడే 8 మీటర్ల పొడవు, 2 టన్నుల భారం వరకు ఉంటుంది. ఇది సుమారు ఒక పెద్ద ఏనుగంత భారం ఉంటుంది.

ప్రతీరోజూ చిన్న తిమింగిలం (దూడ) 600 లీటర్ల పాలు తాగుతుంది. వారం రోజులలో అతి శీఘ్రంగా పెరిగిపోయి, బరువు రెండింతలు అవుతుంది. తల్లి పిల్లల సంబంధం వీటిలో బహుకాలం మంచి ఉంది. చిన్నవి అలసినప్పుడు తల్లిప్రేమ అవసరమై తల్లిని చేరుతుంటాయి.

ప్రపథమంలో తిమింగిలాల క్రొవ్వు నూనెదీపాలు వెలిగించుకోడానికి ఉపయోగించేవారు. కానీ ఇప్పుడు ఇది అనేక పరిశ్రమలలో ల్యూబ్రికెంట్ (కందెన) గా వాడుతున్నారు. మార్గారిన్ తయారుచేయడానికి ఉపయోగిస్తున్నారు. సౌందర్యపోషక వస్తువులైన కాస్మెటిక్స్, డిటర్జెంట్ సబ్బుల తయారీలోను, క్రొవ్వు సంబంధమైన ఆమ్లాలుగాను ఉపయోగిస్తున్నారు.

18 దేశాలకు ప్రతినిధిగా ఇంటర్నేషనల్ వేలింగ్ కమిషన్ ఏర్పడింది. తిమింగిలాల వేటను నిరోధిస్తూ అవి అంతరించి పోకుండా నిబంధనలను జారీచేసి బ్లూ తిమింగిలాలను, రార్‌ఖ్యుయెల్ (Rorqual) లను సంరక్షిస్తూంది.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎన్' సౌజన్యంతో

## అరటిపండు - పిల్లలకు మంచి పోషకాహారము



పోషకాహార లోపంవల్ల నీరసించిపోయిన పిల్లలకు ప్రతీరోజూ అరటిపండు ఇవ్వడం మంచిది.

“ప్రయత్నించి పని చేయనివానికి పరమాత్ముడు సహకరించడు.”

# మానవజాతికి వృక్షానికి గల సామ్యం

షరోన్ కీత్

వృక్షం ఎంతో సొగసుగా, దృఢంగా, సౌమ్యంగా ఉండి ఎప్పటి కప్పుడు మార్పులు పొందుతూ ప్రకృతిలో ప్రవృద్ధి పొందు తూంది. వివిధ శాఖలు, వ్రేళ్ళు, బోదె వివిధ దిశలకు లాగుతున్నట్టు కనిపించినా వృక్షం



సుస్థిరంగా, ఒంటరిగా నిలబడుతుంది. మానవ జాతి ఒక చెట్టును అనేక విధాలుగా పోలి ఉంది. అందంగా, చైతన్యవంతంగా, పొందికగా సహకార భావంతో ఉంటూ సంభవించే మార్పులకు అనుగుణంగా జీవిస్తుంది.

ప్రపంచంలో మానవజాతిని చెట్టు ఆకులకు పోల్చవచ్చు ఎన్ని ఆకారాలు! ఎన్ని పరిమాణాలు! ఎన్ని వర్ణాలు! ఏ ఒక్కరూ మరొకరిని పోలి ఉండరు. వృక్షం యొక్క వివిధ శాఖలు ప్రపంచంలో వివిధ దేశాలకు పోల్చవచ్చు. ప్రతీ కొమ్మ ఒక్కొక్క దిక్కుకు ప్రసరిస్తుంది. వ్యక్తిగత స్వాతంత్ర్యంతో ప్రవర్తించినా ప్రతీ కొమ్మా మధ్య బోదెకు అంటిపెట్టుకు ఉంటుంది. [illegible] ప్రతీ కొమ్మా పోషణకు చెట్టుని ఆశ్రయిస్తుంది. అదేవిధంగా మన ప్రపంచంలో వివిధ దేశాలు విభిన్నంగా ఉంటున్నా ఒకే కుటుంబానికి చెంది వ్యవసాయరంగంలో, వైద్యకీయరంగంలో, సాంకేతికరంగంలో, వ్యాపారానికి, విద్యాభివృద్ధికి ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నాయి.

ఒక వృక్షానికి దృఢమైన వ్రేళ్ళు మరియు మూలవ్యవస్థ అవసరం భూమిలో వ్రేళ్ళు నాలుగు ప్రక్కలకు పారి వృక్షాన్ని భూమిలో దిట్టంగా నిలదన్ని అవసరమైన పోషకాంశాలను భూమినుండి గ్రహించి వృక్షానికి అందిస్తాయి. ఇప్పుడు ఉన్న ఈ స్థితికి మనం రావడానికి పట్టిన కాల వ్యవధిని చరిత్రను వ్రేళ్ళు నిరూపిస్తాయి. సంకీర్ణమైన వ్రేళ్ళు వాటి వ్యవస్థ వివిధ దేశాలలో విశ్వరహస్యాలను పరిశోధించే వైజ్ఞానిక బృందాన్ని సూచిస్తాయి వీరు నిర్విరామంగా యమయాతనతో కృషిచేస్తారు. సమస్యలకు పరిష్కారాలను

## విశ్వాసహీనుడు పాపాత్ముడు

విశ్వాసం లేకపోవడం మహాపాపం. విశ్వాసం సర్వ పాపాలను సమూలంగా పోగొడుతుంది. పాము కుబుసమును విడిచినట్లు శ్రద్ధావంతుడు అన్ని పాపాలను పోగొట్టుకుంటాడు. — సుభాషితం

"పాపపు జన్మ ఎత్తినవారు కూడా దేవుని ఆశ్రయించి పుణ్యాత్ములగుదురు."

వెతుకుతారు. సమాధానాలు తెలుసుకుంటారు. వివిధ రోగాలకు చికిత్సలు, ఔషధాలు వెతుకుతారు. ఉత్తమరీతి కృషి కార్యకలాపాలను అనుసరిస్తారు. అధికస్థాయి సాంకేతిక విద్యను అవలంబిస్తారు.

చెట్టులో ప్రతి భాగంలో ప్రసరించే సారము దీని జీవరసము. ఇది జీవితంలో ప్రేమ, విశ్వాసం, ఆనందం, శాంతి, ప్రశాంత మొదలైన వాటికి ప్రతీక ఈ జీవరసాలే లేకపోతే ప్రతి చిన్న కొమ్మ చిగురు వాడిపోతుంది. వృక్షానికి నెమ్మదే కనిపించదు. పెనుగాలులు చెట్టుమీదికి వీస్తాయి. కొమ్మలను వంచేస్తాయి. ఆకులను ఆడించేస్తాయి ఇవన్నీ ప్రపంచంలో కల్లోలాలు కలిగించే వివిధ భావాలు, విశ్వాసాలు, మనస్తాపాలు, జగడాలు. పోరాటాలు

సూర్యభగవానుడే మన శక్తికి ఆధారం. ఇది నిరంతరం ఆకులకు కావలసిన శక్తిని అందిస్తుంది. ఆకులు ఈ శక్తితో ప్రాణప్రదమైన చక్కెరలను, కార్బోహైడ్రేటులను తయారుచేస్తాయి ప్రతీ ఒక్క ఆకు పగటిపూట సూర్యునివైపు చూస్తూ సూర్యకాంతి తనపై పడేటట్లు చేసుకుంటుంది సూర్యుడు భగవంతుడికి సంకేతము. భగవంతుడు లేనిదే చెట్లు ఉండవు. మానవులు ఉండరు. ప్రపంచమే ఉండదు. ప్రాణి జీవించవలసిన అవశ్యకతే ఉండదు. భగవంతుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు. జీవిత విధానాన్ని నియంత్రిస్తాడు

ప్రతి ఆకు ఒక ప్రత్యేక వ్యక్తి ఏ రెండు ఆకులు సమంకావు ప్రతి ఆకు చిగురు నుంచి పెరుగుతుంది దాని ధర్మం నిర్వర్తిస్తుంది శరత్కాలానికి పూర్తిగా పెరుగుతుంది రంగు మారుతుంది రాలిపోతుంది. భూమిలో చేరి తిరిగి చెట్టుకు ఎరువుగా మారుతుంది అయినా ఒక్క ఆకు చేయలేని పని ఆకులు అన్నీ చేరి మంచి నీడను కలిగిస్తాయి చెట్టు ఇచ్చే అందాన్ని, సౌందర్యాన్ని ఒక్క ఆకు ఇవ్వలేదు

మానవుడు వ్యక్తిగత జీవుడు. స్వతంత్రంగా ప్రవర్తించగలవాడు. కానీ మానవజాతి అంతా వృక్షంలా ఒకటే. అపూర్వమైన వ్యక్తిగత మానవశక్తులే మానవజాతిని సుస్థిరంగా నిలబెడతాయి.

—'ది రొటేరియన్' సౌజన్యంతో

## 'బటర్‌ఫ్లైస్'ను 'ఫ్లట్టర్ బైస్' అనేవారు



పూర్వం (బటర్‌ఫ్లైస్) సీతాకోక చిలుకలను 'ఫ్లట్టర్‌బైస్' అనేవారు. క్రాస్ వర్డ్ పజిల్‌ను 'వర్డ్ క్రాస్' అని, సైడ్‌బర్న్స్‌ను 'బర్న్‌సైడ్స్' అని అనేవారు.

"ప్రతీ విషయంలోను మితాన్ని మించితే ప్రకృతి అడ్డం తిరుగుతుంది."

—హిపోక్రేటస్

# దారిద్ర్యము - బాలకార్మికులు

ఎల్. బాలసుబ్రమణియమ్

నేడు ప్రపంచంలో బాలకార్మికుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ప్రపంచంలో మిక్కిలి ఎక్కువగా బాలకార్మికులు భారతదేశంలో ఉన్నారేమో అని సందేహపడవలసి వస్తూంది 27 వ నేషనల్ సాంపిల్ సర్వే లెక్కల ప్రకారం మొత్తం 15.1 మిలి



యను బాల కార్మికులు ఉన్నారు. తమిళనాడు శివకాశి జిల్లా బాలకార్మిక శక్తి వినియోగానికి ప్రసిద్ధి పొందింది ఇక్కడ అగ్గిపెట్టెల పరిశ్రమలలో వేలకొద్దీ 5 సంవత్సరాల వయస్సు గల బాలకార్మికులు ఒక్కొక్కరు రోజుకి 10 గంటలు కూడా పని చేస్తారు. సుమారు 40,000 మంది పిల్లలు శివకాశిలో బాణాసంచా పరిశ్రమలలోను, కాలెండర్లు తయారుచేసే ఇతర సంస్థలలోను పని చేస్తున్నారు. ఈ సంస్థలు, పరిశ్రమలు పనిచేసే శ్రామికులలో సగంపైన అందరూ పిల్లలే.

ఉత్తరప్రదేశ్ బాదోహిలో తివాసీనేత పరిశ్రమలలో పనిచేసే 50,000 మంది కూలీలలో 25 శాతం పసిపిల్లలే. మీర్జాపూర్‌లో 20,000 కార్మికులలో 8,000 మంది చిన్న పిల్లలు. ఇక కాశ్మీర్ తివాసీ నేతపరిశ్రమలో నడుం పడిపోయే పనులకు చిన్న చిన్న ఆడపిల్లలను వినియోగిస్తారు. చేతి నగిషీ పట్టు పరిశ్రమలో ఇక్కడ పొద్దస్తమానం ఒకే విధంగా కూర్చుని కంటి దృష్టి మార్చ

## ప్రపంచ రికార్డు

### ఒకే తపాలా బిళ్లకి ప్రపంచంలో అత్యధిక రికార్డు ధర

135 సంవత్సరాలకు ముందు రెండు పెంట్లకు అమ్మబడిన లేడీ మాక్‌గిల్ (Lady Mcgill) అనే యునైటెడ్ స్టేట్స్ తపాలాబిళ్ళకి న్యూయార్క్ వేలంలో 1.1 మిలియను డాలర్లు లభించింది. ఒకే ఒక తపాలబిళ్ళకి ఇంత సొమ్ము రావడం ప్రపంచ రికార్డు.

### లేసర్ కిరణ వేగానికి ప్రపంచ రికార్డు

యునైటెడ్ స్టేట్స్ న్యూయార్క్ GTE కార్పొరేషన్‌లో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు లేసర్ కిరణ వేగానికి క్రొత్త ప్రపంచ రికార్డును సాధించారు. ఒక సెకండులో 22 బిలియన్ సార్లు స్విచ్ వేసి మూయగల లేసర్ కిరణాన్ని కనిపెట్టారు. ఇంతకు ముందు లేసర్ వేగం సెకండుకి 18 బిలియను విగ్నల్సు రికార్డు అయింది.

"పాము నోటిలో ఉన్న విషం పామును ఏమీ చేయలేదు. కాటు వేసినవారినే అది బాధిస్తుంది."

కుండా పని చేయడానికి పిల్లలను వియోగి స్తారు. దీనివల్ల పిల్లలకు అనేకవిధాలైన అవయవ లోపాలు సంభవిస్తున్నాయి. వీరు శాశ్వతంగా వికలాంగులు అయిపోతున్నారు. గుజరాత్‌లో సూరత్, దాని చుట్టుపక్ల 13-15 సంవత్సరాల వయస్సు గల పిల్లలను కండ్లకు మిక్కిలి అపాయకరమైన వజ్రాల శోతపనులకు వియోగిస్తున్నారు.

బాల కార్మికశక్తి బానిస జీవితానికి అతి సన్నిహితంగా ఉంటుంది. బానిసగా కట్టుబడి ఉండడానికి 6 సంవత్సరాల వయస్సుగల పిల్లలను తీసుకుంటారు. ఒరిస్సాలో ఒక విధంగా అప్పు తీర్చుకోవాలంటే 8, 10 సంవత్సరాల వయస్సు గల ఆడపిల్లలను అప్పిచ్చిన వారికి పనికత్తెలుగా అమ్ముతారు. భారతదేశంలో అనేక చోట్ల బానిసలుగా ఉంటూన్న తండ్రులు తమ కుమారులను బానిసలుగా వియమించి విరమింతుకుంటు న్నారు.

పసిపిల్లలు ముఖ్యంగా మగపిల్లలు ఖనిజ పరిశ్రమలో ముఖ్యపాత్రను వహిస్తారు. పెద్దవాళ్ళు గనులు త్రవ్వుతుంటే బాలురు బొగ్గును పైకి మోసుకుపోతారు. వీరు వంగ నవసరం లేకుండా స్వరంగాలలో నడవ గలుగుతారు కాబట్టి సాధారణంగా 12 సం.ల లోపు పిల్లలనే వియోగిస్తారు.

40 శాతం కటిక దరిద్రులతో నిండిన మన దేశంలో పిల్లలు తప్పనిసరిగా పని చేయవలసి వస్తుంది. ఎంత తక్కువైనా వారి సంపాదన లేకుండా అప్పటికే తక్కువ స్థాయిలో ఉన్న జీవన ప్రమాణం ఇంకా దిగజారిపోతుంది. ఈ పరిస్థితులలో పనిలేని వారివల్ల దొంగతనాలు, నేరాలు పెరిగి పోతాయి. కటిక దారిద్ర్యంవల్ల, నిరు ద్యోగంవల్ల ఏర్పడిన ముఖ్య సమస్యలవల్లే బాల కార్మికులు ఏర్పడ్డారు. బాల కార్మికులు తగ్గాలంటే సంఘంలో సంస్కారం ఏర్ప డాలి. క్రొత్త ఉద్యోగాలను సృష్టించాలి. సహకార సంఘాలను ఏర్పరచాలి. సాంఘిక, సామాజిక భద్రతా ప్రణాళికలను చేపట్టాలి. పరిశ్రమ పర్యవేక్షణ, దానికి సంబంధించిన చట్టాలు మరింత కట్టుదిట్టంగా ఉండాలి. పసి పిల్లలు ఆరోగ్యం చెడగొట్టుకుని బాల కార్మి కులుగా పనిచేయటం చాలా శోచనీయమైన విషయం.

—'సిఐఇ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

## ప్రపంచంలో 8,600 పక్షి జాతులు



ఈనాడు ప్రపంచంలో నివసిస్తూన్న పక్షి జాతులు సుమారు 8,600 భౌగోళిక సంబంధమైన జాతులను కూడా తీసుకుంటే మొత్తం సంఖ్య సుమారు 30,000 ఉంటుంది.

"ఒకనాడున్న సంపద మరొకనాడుండదు.
ఒకనాడున్న సుఖము మరియొకనాడుండదు."

# వీరిని గురించి తెలుసుకోండి

బాలగంగాధర్ తిలక్ (1856 - 1920):

వెనుదీయని విశ్చలమైన స్వదేశాభిమాని మరియు ఆధునిక భారతదేశ నిర్మాత. లక్నో కాంగ్రెస్ (1916) సమావేశంలో



BAL GANGADHAR TILAK

'స్వరాజ్యము నా జన్మహక్కు' అనే మరపురాని మాటను మొదట చెప్పిన గొప్ప స్వాతంత్ర్య యోధుడు. భగవద్గీతను వివరించే 'గీతా రహస్య'మను గొప్ప గ్రంథమును ఇతడు చెరసాలలో రచించాడు.

* * *

వేదాంత దేశికర్:

సుప్రసిద్ధకవి, తాత్వికుడు మరియు యోగి. ఇతడు సంస్కృతం, ప్రాకృతం మరియు తమిళభాషలలో 100కి పైగా గ్రంథాలను రచించాడు. ఇతడి జీవితకాలం (1268 ఎ.డి. 1369 ఎ.డి) వైష్ణవ చరిత్రలో మిక్కిలి అద్భుతమైనది.

* * *

## సేవా ప్రభావం

కరుణాకటాక్ష! నీవుభయసేనా మధ్యంబున విరాయుధుడవై యర్జునునకు సారథ్యంబు సేయు వాడు నీ దాసుండైన భీష్ముండు నీచేత చక్రంబు నెత్తించె.

నీ కూతురైన గంగాభవాని హరుని జటా మకుటం బెక్కె.

నీకు పాన్పైన శేషుడు బ్రహ్మాండంబు నెత్తి కెత్తుకొనియె.

నీకు వాహనంబైన ఖగేంద్రుం డింద్రాదుల నోడించి యమృతంబు గొనియె.

నీకు దాసుండైన ధృవుండు బ్రహ్మలోకంబు నాక్రమించె.

నారదుడు దేవాసురులకుం బోరు పెట్టుచున్నాడు.

రుక్మాంగదుడు యమలోకంబు బాడు సేసె.

శుకుండు ముక్తి జూరగొనియె. నీకు బంటైన యాంజనేయుండు మరల కభేద్యమైన లంకానగరంబు దహనంబు సేసె.

నీకు భక్తుండైన కుచేలుండు పిడికెడటుకులు సమర్పించి సంపద ననుభవించె.

ఈ రీతి నీ దాసులు నీ విచ్చిన సరిగను నీ కంటె బెచ్చు పెరుగుచున్నారు.

నీ దాసుల కిచ్చిన చనవులను, నీ సేవా ప్రభావంబులను లోకంబునం జెల్లుబడియై చెల్లుచుండ జేసితివి.

నీ కింకరుల చరిత్రంబులను, నీ యుదారత్వంబును వినియు విన్నపించు కొగుడుచున్నారము. శ్రీ వేంకటేశ్వరా.

—శ్రీ తాళ్ళపాక పెదతిరుమలాచార్య

"బిడ్డ బాగుపడవలెనని కోరిన తల్లి బిడ్డపై కోపించవచ్చు; కొట్టవచ్చు. సంకల్పము మంచిది కనుక తప్పు లేదు."

**లె కోర్‌బుసీర్ (Le Corbusier)**
**1887 - 1965:**

స్విస్ దేశానికి చెందిన గొప్ప శిల్పి. పెద్ద ఎత్తున సామూహిక భవన నిర్మాణం ఇతని అభిమాన వృత్తి. తూర్పు ఫ్రాన్స్‌లో పిలిగ్రిమేజి రాంచాప్ చర్చి, ఫ్రాన్స్‌లో లాటొరాట్ మొనాష్ట్రి (monastery of LaTourette), న్యూయార్క్ నగరంలో యునైటెడ్ నేషన్స్ భవనం మొదలైనవి ఇతడు నిర్మించిన ముఖ్యమైన భవనాలు. పంజాబ్‌లో చండీఘర్ నగరానికి ఒక పద్ధతి ఏర్పరచి ప్లాన్ వేసినది ఇతడే.

* * *

**రహిమ్‌తుల్లా శయానీ**

బొంబాయి యూనివర్శిటీలో మాస్టర్ డిగ్రీని పొందిన మొట్టమొదటి మహమ్మదీయుడు. జాతీయ చట్టనిర్మాతకుడుగా ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో పేరు పొందాడు. 1896 లో కలకత్తాలో జరిగిన నేషనల్ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించాడు.

* * *

**దిన్‌షా ఎడుల్జీ వాచా**
**(Dinshaw Edulgı Wacha) :**

భారత స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్న వారిలో ముఖ్యుడు. భారతజాతీయ కాంగ్రెస్‌లో సుమారు 25 సంవత్సరాలకు పైగా సభ్యుడుగా ఉన్నాడు. దేశ ఆర్థిక వ్యవహారాలలో ఇతడు ఆరితేరిన నిపుణుడు. 1920 లో ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియాకి గవర్నరు పదవిని అధిష్ఠించాడు.

## పండ్లు, కాయగూరల విశిష్టతను తెలియజేసే యంత్రము



లెనిన్ గ్రాడ్‌లో టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ది రిఫ్రిజిరేషన్ ఇంతస్త్రీవారు రూపొందించిన ఒక యంత్రం పండ్లు మరియు కాయగూరల విశిష్టతను తెలియజేస్తుంది. బంగాళాదుంపవంటి కాయగూరలలో తరిగిన చిన్న ముక్కను ఈ యంత్రం ఎలక్ట్రోడులు మధ్యపెట్టినప్పుడు దీనిగుండా కరెంటు ప్రవహిస్తుంది. యంత్రంమీద 'నిరాకరింతు', 'వెంటనే ఉపయోగించు', 'నిలువచేయు' అనే సూచనలు సూచింపబడతాయి.

"మానవులు కోరినవిధంగా జీవించలేరు,
జీవించగలిగినట్టుగా జీవిస్తారు."

# ౧౦౦౦ రకాల ద్రాక్ష

మధుర రసం పుష్కలంగా 'ఉండే ద్రాక్ష పళ్ళు పుష్టికరమైన ఆహారం. వీటి కల్చర్ (ద్రాక్షసాగు) మానవజాతి అంత పురాతనమైనది. బైబిల్‌లో నోవా ద్రాక్ష తోటను పెంచాడు. అతడికి ముందు 'ఈజిప్టు



ఫారో'లు స్వర్గ సంబంధమైన దానినిగా అభిమానించి ద్రాక్షను పెంచారు.

ద్రాక్షరసమును, ద్రాక్షాసవమును, మద్యమును తయారుచేయుటకు ముఖ్యంగా ద్రాక్షను పండిస్తున్నారు. ద్రాక్షరసాన్ని పెద్ద పెద్ద పాత్రలలో పులియబెట్టి ద్రాక్ష సారాయిని, ద్రాక్షామ్లాన్ని తయారుచేస్తారు.

ద్రాక్ష సాగుకి శీతోష్ణస్థితి చాలా ముఖ్యమైనది. గాలి పొడిగా ఉండి వర్షాలులేకుండా ఉండే ఉష్ణప్రదేశాలు దీనికి అనువైనవి. వైటిస్ వైనిఫెరా (Vitis Vinefera) అనే ద్రాక్షతీగ రష్యాలో కాస్పియన్ సముద్ర తీరంలో పుట్టింది. ద్రాక్ష విస్తారంగా పండించే ఉష్ణప్రదేశాలలో భారతదేశం ఒకటి. ప్రాచీన కాలంలో చరకుడు, సుశ్రుతుడు మొదలైన వైద్య నిపుణులు తమ వైద్య గ్రంథాలలో ద్రాక్షను గురించి పేర్కొన్నారు. దీనిని 1300 లో మహమ్మదీయులు పెర్షియా, ఆఫ్ఘనిస్థాను మీదుగా భారతదేశానికి తీసుకు వచ్చారు.

ప్రపంచంలో మొత్తం 25 మిలియను ఎకరాల విస్తీర్ణం గల భూమి ద్రాక్షసాగులో ఉంది. పశ్చిమ ఆసియా (మధ్యప్రాచ్యం) నుండి ద్రాక్ష సాగుబడి యు.కె., ఫ్రాన్స్, జర్మనీ, స్పెయిన్, ఇటలీ, తూర్పుయూరప్, గ్రీసు మరియు యుఎస్ఎ వంటి పశ్చిమ దేశాలకు ప్రాకింది. వీరు లాభదాయకమైన మద్యము మరియు సారా ఉత్పాదక పరిశ్రమలకు దీనిని విస్తారంగా పండిస్తారు. టర్కీ, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఇరాక్, లెబనాన్, ఇజ్రేల్, మరియు ఈజిప్టులలో ముఖ్యంగా ఎండుద్రాక్ష తయారీకి ద్రాక్షను పండిస్తారు. కొలంబియా, బ్రెజిల్, భారతదేశం మొదలైన ఉష్ణదేశాలలో ద్రాక్ష ఉపాహారంగా పండించబడుతుంది.

ద్రాక్ష కాలానుగుణంగా ఆకులు రాల్చి తిరిగి చిగురుపట్టి తీగగా ఒక ఆసరాతో పైకి ఎగబ్రాకుతుంది. ముఖ్యంగా అంట్లు కట్టుటద్వారా మరియు కొమ్మలుద్వారా దీనిని ప్రవృద్ధిచేస్తారు. వేళ్ళు బాగా వచ్చేవరకు వీటిని నర్సరీలలో పెంచుతారు. రెండు మూడు చిగురు మొగ్గలు గల 30 సెం మీ.ల ముదర తీగముక్కలను చదును భూమిలో నాటుతారు. కొమ్మలు వ్రేళ్ళను తన్నిన తరువాత జాగ్రత్తగా తీసి తిరిగి 60 సెం. మీ.ల లోతుగల 90 × 90 చ.సెం.మీ.లు చదరపు గోతులలో ఎరువువేసి వీటిని

2½, 3½ మీటర్ల ఎడంలో పాతుతారు. ఇది తీగ కాబట్టి దీనికి పందిళ్ళు అవసరం. వేళ్ళ అడుగున నీరు నిలువకుండా వడియు సౌకర్యం పుష్కలంగా ఉండే కంకరతో కూడిన ఇసుక భూమిలోను, రేవడి, వండ్ర భూములలోను ద్రాక్ష ఏపుగా పెరుగుతుంది. ఎరువు పెట్టిన భూములలో బాగా పెరుగుతాయి. పళ్ళ దిగుబడి బాగా ఉంటుంది. కానీ ఈ పళ్ళు మద్యం తయారుచేయడానికి అనువుగా ఉండవు.

మంచి ద్రాక్షతీగ బాగా పెరిగి 3.5 మీటర్ల ప్రాకుతుంది, ద్రాక్షపువ్వులు ఆకు పచ్చ రంగులో ఉంటాయి. ద్రాక్షకు కత్తిన ప్రక్రియ (కత్తిరింపు) ముఖ్యము. స్థానిక పరిస్థితులను అనుసరించి రొట్ట పెరుగుదలను నిరోధించి పంటను అధికం చేయడానికి కొన్ని నిర్ణయించిన కాలాలలో రొట్ట ఎక్కువగా పెరిగిన తీగలను కత్తిరిస్తారు. సాధారణంగా ఏడాదికి రెండుసార్లు కత్తిరిస్తారు. వర్తమాన కాలంలో పెరిగిన భాగాలనే కత్తిరిస్తారు. కత్తిరించకుండా వదలవలసిన మొగ్గలసంఖ్య ఆ యా రకములను, అలవాట్లను బట్టి ఉంటుంది. డిసెంబరు నెలలో దిగిన పందె ఏప్రిల్ మాసానికి పెరిగి పండి అమ్మకానికి వీలుగా ఉంటాయి.

మంచి తియ్యపండ్ల గుత్తులు ఏర్పడడానికి మొదట చల్లని పొడి వాతావరణం ఉండి, తరువాత బాగా ఎండకాయడం అవసరం. అధికంగా మంచు, వర్షంవల్ల పండ్లు బాగా పుల్లగా ఉంటాయి. సాధారణంగా ద్రాక్షతీగ 3 వ సంవత్సరానికి కాపుకు వస్తుంది. ఆ తరువాత కొన్ని సంవత్సరాల పాటు క్రమంగా కాపు కాస్తుంది. యూరప్‌లో 100 సంవత్సరాలనుండీ కాస్తున్న ద్రాక్ష తీగలున్నాయని ప్రసిద్ధి.

తీగమీదే ద్రాక్ష పండుతుంది. ద్రాక్ష గుత్తులు కోసిన తరువాత పండవు అందు చేత బాగా పండిన తరువాతే ద్రాక్షగుత్తులను కోస్తారు. అన్ని గుత్తులు ఒకేసారి పండవు. ఏ దశలో గుత్తులను కోస్తామో దానిమీద పండ్ల నాణ్యత ఏర్పడి ఉంటుంది. పండ్లకోత ఒక్కొక్కప్పుడు 12 మొదలు 20 రోజులు దాకా ఉంటుంది. గుత్తిపలకబారి పండ్లు క్రింది భాగం గాజులా పారదర్శకంగా ఉంటే గుత్తి కోతకు సిద్ధంగా ఉంటుంది. పళ్ళు కొంచెం తెల్లబారి కొద్దిగా

## ఆస్ట్రిచ్ గంటకు 40 మైళ్లు పరుగెత్తగలదు



నిప్పుకోడి (ఆస్ట్రిచ్) వేటగాళ్ళ బారి నుండి తప్పించుకోడానికి గంటకు 40 మైళ్ళ వేగంతో పరుగెత్తుతుంది. పెరిగిన ఆస్ట్రిచ్ ఒకసారి తన్నితే మనిషి కాలు విరిగిపోయేటంత బ్రహ్మాండంగా ఉంటుంది దీని కాలి బలం.

"జ్ఞాని మానవునిలో దైవాన్ని చూస్తే
అజ్ఞాని దైవంలో మానవుని చూస్తాడు."

ఉబ్బుతాయి. అప్పుడు కూడా గుత్తులు కోతకు సిద్ధం అని తెలుసుకోవాలి.

ద్రాక్షపళ్ళలో వివిధ చక్కెరలు, ఆమ్లాలు సమపాళ్ళలో లభిస్తాయి. ద్రాక్ష చక్కెరలలో గ్లూకోజు లేక డెక్స్ట్రోజు ఉంటుంది. అధికంగా గ్లూకోజు ఉన్న పళ్ళు అతి శీఘ్రంగా (Ferment) పులుస్తాయి. కొన్ని రకాలు మాత్రమే ఉత్తమరకం మద్యాలు తయారుచేయడానికి అనువుగా ఉంటాయి. ద్రాక్షలో అధికంగా పెక్టిన్ ఉంటుంది. కాబట్టి వీటితో జాములు, మార్మలేడులు (marmalades) సులభంగా తయారుచేయవచ్చు.

ఉపాహారంగా ఉపయోగపడే ద్రాక్షలో ఇనుము, సున్నము, నత్తు ఫాస్ఫేటు పుష్కలంగా ఉంటాయి. కొద్ది కొద్దిగా అయోడీను, విటమిను A, క్లోరైడులు కూడా లభిస్తాయి.

బాగా పండిన ద్రాక్షపళ్ళు సులభంగా జీర్ణమవుతాయి. మితిమీరి తింటే కొద్దిగా కడుపు ఉబ్బుతుంది. ఏదో ఆయాసంగా ఉన్నట్టు అనిపిస్తుంది. ద్రాక్ష దాహాన్ని కడుతుంది. తినడానికి మిక్కిలి రుచిగా ఉంటాయి. మూత్రకోశాలకు ఉత్తేజకరంగా ఉంటాయి. సౌమ్యమైన విరేచనకారి.

'రెయిజెన్స్' ఎండుద్రాక్షపళ్ళు ఆరోగ్యకరము. బలవర్థకము. చంటిపిల్లలకు చాలా ఆరోగ్యకరమైనవి. గోరువెచ్చని నీటిలో నానబెట్టి ఆ నీటిని త్రాగిస్తే మంచినీళ్ళ కంటే రుచిగా త్రాగుతారు. శక్తిని ఇస్తుంది. ఆరోగ్యాన్ని కాపాడుతుంది.

వ్యాపారరీత్యా సుమారు 8,000కు పైబడిన ద్రాక్షరకాలు పండిస్తారు. ఈ రకాలన్నీ ఉపయోగ దృష్ట్యా రసపు ద్రాక్ష, ఎండుద్రాక్ష, ఉపాహార ద్రాక్ష అనే మూడు ముఖ్య వర్గాలుగా విభజింపబడ్డాయి. అలెగ్జాండ్రియాలో పండే బ్లాక్ ప్రిన్స్, మస్కాట్ మొదలైనవి ద్రాక్షరసం తయారుచేయడానికి ఉపయోగిస్తారు. సుల్తానా, థాంప్సన్ వంటి గింజలులేని రకాలు ఎండబెట్టి ఎండుద్రాక్షపళ్లుగాను, కిస్మిస్ పళ్లుగాను ఉపయోగిస్తారు. అనబ్ ఎ షాహి, భోక్రి, ఫక్రే మొదలైనవి మనదేశంలో చాలా ప్రసిద్ధి పొందాయి. ఆంధ్రప్రదేశ్‌లోను, మహారాష్ట్రలోను అనబ్ ఎ షాహి పచ్చి ద్రాక్షపళ్ళు పేరు

(మిగతా 41 వ పేజీలో)

## రాజస్థాన్ ఎడారిలో జనసాంద్రత



రాజస్థాన్ పెద్ద ఎడారిలో గల మొత్తం ఎనిమిది జిల్లాలలో జనసాంద్రత చ. మైలుకు 80 మంది. ప్రపంచంలో గల ఇటువంటి ఇతర ప్రదేశాలలో కంటే ఇది 15 మొదలు 20 రెట్లు అధికం.

"అదృష్టము బయటపడు సమయమునందు విధినిర్ణయం విదితమవుతుంది."

# నయాగరా జలపాతము

బ్రాన్‌లె ఎలాన్ బ్రాన్‌సన్

ఉత్తర అమెరికాలో నయాగరా జలపాతంవంటి ప్రకృతి రమణీయమైన దృశ్యం మరొకటి లేదు. గత 25 సంవత్సరాలలో 100 మిలియను మందికి పైబడిన జనం దీనిని సందర్శించారు.


Niagara

కౌతుకాత్మకమైన ఈ జలపాతాన్ని మొట్టమొదట 1678 లో ఒక భూగోళ అన్వేషకుడు, మతప్రచారకుడు అయిన లూయి హెన్నెపిన్ కనుగొన్నాడు. ఒంటారియో, ఈరీ సరస్సులు మరియు యునైటెడ్ స్టేట్స్, కెనడా మధ్యనున్న అమెరికన్ జలపాతము 51 మీటర్లు మరియు హార్స్‌షూ జలపాతం 48.2 మీటర్ల ఎత్తు ఉన్నాయి.

యుఎస్ఎ న్యూయార్క్‌లోని బఫెలో నుంచి నయాగరా జలపాతం వరకు రైలు మార్గం నిర్మింపబడిన నాటినుండి పర్యాటక కేంద్రాలు, వాటికి సంబంధించిన ఇతర సంస్థలు అభివృద్ధిని చేపట్టాయి.

1885 లో న్యూయార్క్ స్టేటు ఇక్కడ అనేక అందమైన పార్కులను, చారిత్రక ప్రదేశాలను అభివృద్ధి చేసింది. 1888 లో ఒంటారియో (కెనడావైపు) అద్భుతంగా క్వీన్ విక్టోరియా పార్కును మరియు ఇతర అనేక అందమైన తోటలను సృష్టించి నిర్మించారు.

## కొండజాతులు అధికంగా ఉప్పును ఉపయోగిస్తారు

సాధారణ ప్రజ సగటున తలసరి 10 గ్రాముల ఉప్పు ఉపయోగిస్తే, కొండజాతులు సుమారు 13.5 గ్రాములు వాడుతున్నారని పశ్చిమ బెంగాలు మరియు ఒరిస్సా ప్రదేశాలలో సేకరించబడిన వివరాలవల్ల తెలుస్తోంది.

## రేడియో స్టార్స్‌కు బ్రహ్మాండమైన ఉష్ణశక్తి

అంతరిక్షంలో దూరంగా ఉండే ప్రదేశాలను అన్వేషించడానికి మానవుడు అపూర్వమైన నూతనశక్తులకోసం నక్షత్రాలను పరిశోధిస్తాడు. కాలిఫోర్నియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఖగోళ శాస్త్రజ్ఞులు కనుగొన్న 'రేడియో స్టార్స్'కు బ్రహ్మాండమైన ఉష్ణశక్తి ఉంది. శక్తివంతమైన నక్షత్రం ఉష్ణశక్తి 20,000 మిలియను సూర్యుల శక్తికి సమానంగా ఉంటుంది.

...గా ఉండడంలో అగౌరవం లేదు. పరిశ్రమించుటకు ...నిచో అది అగౌరవం."

డీజెల్ నూనెతో పనిచేసే "మెయిడ్ ఆఫ్ ది మిస్ట్ బోట్" 1885 లో నయాగరా నదిలో ప్రయాణం చేశాయి. వేగమంతతో కప్పబడిన హోరుమని శబ్దంచేసే జలపాతం మధ్యప్రదేశంవరకు ఈ పడవలు ప్రయాణం చేశాయి. ప్రాస్పెక్ట్ పాయింటు నుండి జలపాతం చూడదానికి ఎంతో హృదయ రంజకంగా ఉంటుంది జీవితంలో మరవరానిది ఈ దృశ్యము. 286 మీటర్లు ఎత్తుగా ఉండే యుఎస్ వైపు ప్రాస్పెక్ట్ పాయింట్ అబ్జర్వేషన్ టవరు, కెనడాప్రక్క స్కైలాన్ టవర్ మీదినుంచి జలపాతం దృశ్యం అతి మనోహరంగా ఉంటుంది. జలపాతం చూడదానికి నయాగరా "వ్యూమొబయిల్స్"లో వెళ్ళవచ్చు. హార్స్‌షూ జలపాతం దగ్గర ఏటవాలు రైలులో వెళ్ళవచ్చు లేదా హెలికాప్టర్ నుంచి చూడవచ్చు.

పెద్ద సున్నపురాయిపొర నిరంతరం నీటిచే కొట్టుకుపోవడంవల్ల, సన్నపాటి నయాగరా మార్గంలో నీటిక్రింద రాతిపొరలు బలహీనంగా ఉండటంచేత జలపాతం సంవత్సరానికి 1 5 మీటర్ల చొప్పున వెనకకు తీసిపోతూంది. అందువల్లే జలపాతం మిక్కిలి నిటారుగా, లోతుగా ఉంటుంది. అంటే ఇది రాను రాను 25 000 సంవత్సరాలకి పూర్తిగా నశించి చిన్న చిన్న పాయలుగా ఏర్పడుతుంది.

నయాగరా జలపాతం ప్రాచీనమైనది కాదు. ఇటీవల 10,000 సంవత్సరాలకు ముందు ఏర్పడింది. బ్రహ్మాండమైన మంచు గడ్డలు కరిగినప్పుడు ఇది ఏర్పడి ఉండాలి. గ్రేట్ లేక్స్ (పెద్ద సరస్సులు) ఏర్పడి, ఇందులో నీరు సున్నపురాతి గుట్టపై నది 6,88,000 చ.కి.మీ. ఉత్తర అమెరికా తూర్పుగా ప్రవహించి బ్రహ్మాండమైన జలపాతంగా ఏర్పడింది.

కెనడా మరియు యుఎస్‌కి ఈ జలపాతం కావలసినంత జలవిద్యుత్తును జనింపచేస్తుంది. 1950 లో ఈ రెండు దేశాలు జలపాత సౌందర్యాన్ని స్థిరంగా నిలబెట్టడానికి కావలసినంత నీటిని ప్రవహింపచేయడానికి ఒప్పందం కుదుర్చుకున్నాయి. మిగిలిన నీరు సుమారు 36,00,000 కిలోవాటుల విద్యుత్తును జనింపచేయడానికి వినియోగింపబడుతూంది.

## లాంగ్‌జంప్‌లో ప్రపంచ రికార్డు



యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన బాబ్ బీమన్ 8.90 మీటర్లు దూకి 1968లో మెక్సికో నగరంలో జరిగిన ఒలింపిక్స్‌లో లాంగ్ జంప్‌లో ప్రపంచ రికార్డును స్థాపించాడు. ఇది ముందు రికార్డుకంటే 0.55 మీటర్లు అధికం. ఇది ఒలింపిక్ ఆటల చరిత్రలో అపూర్వమైన సింగిల్ ఇవెంట్.

# ఎరువులు - ఎరువుల ఉత్పాదన

హెచ్. కె. లక్ష్మణరావు
(డిప్యూటీ జనరల్ మేనేజరు, మద్రాసు ఫెర్టిలైజర్స్ లిమిటెడ్, మద్రాసు)

ప్రపంచంలో పెద్ద పెద్ద దేశాలలో భారత దేశం ఏడవ స్థానాన్ని ఆక్రమిస్తూంది. ఈ దేశంలో మొత్తం 6 లక్షల గ్రామాలు ఉన్నాయి. దేశం మొత్తం వైశాల్యం 32,



87,263 చ.కి.మీలు. భారతదేశపు మొత్తం జనాభా 700 మిలియను. 1961లో ఉన్న 439 మిలియను జనాభా 1981లో 685 మిలియనుకు పెరిగింది. ఈ కాలావధిలో ఆహారధాన్యాల ఉత్పత్తి 50 మిలియను టన్నులు పెరిగింది.

మన దేశంలో వ్యవసాయరంగం 40% ఉత్పాదన చేస్తూ 60% కార్మికులకు జీవనోపాధి కల్పిస్తూంది. మొత్తం ఎగుమతులలో 35 శాతం చేపడుతూంది.

ప్రస్తుతం సాలీనా 150 మిలియను టన్నులు ఉన్న ఆహార ధాన్యాల ఉత్పాదక స్థాయి 1962-63లో 80 మిలియను టన్నులు మాత్రమే ఉంది. 2001 సంవత్సరానికి అతి శీఘ్రంగా అధికంగా పెరిగిపోతూన్న జనాభా అవసరాలకు సరిపడేటట్టు 235 మిలియను టన్నుల ఉత్పాదక స్థాయిని అందుకోవాలి.

భారతదేశంలో జాతీయ ఆదాయాభివృద్ధికి 60 శాతం వ్యవసాయం మరియు దీనికి సంబంధించిన (పాడి పశువుల పెంపకం, అడవుల పెంపకం, చేపల పరిశ్రమ, కుండల తయారీ, కమ్మరం) వృత్తి వ్యాపారాలవల్ల లభిస్తూంది. భారతదేశంలో అనేక పరిశ్రమలకు ప్రత్తి, నార, చెరకు, కాఫీ, టీ మానెగింజలు వగైరా ముడిసరకులను వ్యవసాయరంగం సరఫరా చేస్తుంది. కానీ భారతదేశంలో వ్యావసాయిక ఉత్పాదన చాలా తక్కువగా ఉండడం మిక్కిలి శోచనీయమైన విషయం. ఉదాహరణకి: భారతదేశంలో వరి ఉత్పాదన హెక్టేరుకి 1,245 కి.గ్రా. అయితే యునైటెడ్ స్టేట్స్‌లో 3,384 కి.గ్రా. లు చైనాలో 2,349 కి.గ్రా. లు, జపానులో 3,977 కి.గ్రా.లు. వ్యవసాయ యోగ్యమైన సగటు భూమి వైశాల్యం రెండు హెక్టేరులకంటె తక్కువ. అందుచేత లాభదాయకంగా కార్యక్రమాలు చేపట్టడానికి వీలులేకపోతూంది.

భారతదేశంలో రకరకాల భూములు సారవంతంగా ఉన్నా మొక్కలు ఆరోగ్యవంతంగా ఏపుగా పెరిగి అధిక ఫలసాయం కలిగించడానికి భూమిలో నత్రజని, భాస్వేటు, మరియు పొటాషు వంటి ముఖ్యమైన పోషకాంశాలు ఉండాలి. భూమిలో మొక్కలకు

"జ్ఞానం సంపాదించుకోడానికి మానవునికి
మరణించేదాకా కావలసినంత అవకాశం ఉంది."

అవసరమైన పోషకాంశాల లోపాన్ని భర్తీ చేయడానికి యూరియా, అమోనియం సల్ఫేటు, సూపర్ ఫాస్ఫేటు, పొటాషు వంటి రసాయనిక ఎరువులు చాలా ముఖ్యం. ఈ రసాయనిక ఎరువులను సరఫరా చేసి వ్యవసాయదారులకు ఎరువుల పరిశ్రమలు తోడ్పడుతున్నాయి



స్వాతంత్ర్యానంతరం అధికాహారోత్పత్తికి 'గ్రో మోర్ ఫుడ్' (grow more food) ప్రచారంవల్ల 1967-68 నుండి 1983-84 వరకు జరిగిన 'హరిత విప్లవం' (green revolution) వల్ల వ్యవసాయ రంగానికి మరియు ఎరువుల పరిశ్రమకు కావలసినంత ప్రోత్సాహం, సహకారం ప్రభుత్వం వారు కలిగించారు.

1906 లో తమిళనాడు ఉత్తర ఆర్కాటు జిల్లాలో రాణిపేట వద్ద స్థాపించబడిన ఇఐడి పారీ అండ్ కో వారి సూపర్ ఫాస్ఫేటు ఫాక్టరీతో భారతదేశంలో మొట్ట మొదటి ఎరువుల ఫాక్టరీ ప్రారంభమైంది. స్వాతంత్ర్యానికి ముందు మరి రెండు సూపర్ ఫాస్ఫేటు ఫాక్టరీలు DMCC (అంబెర్నాథ్) మరియు DCM (ఢిల్లీ) వారిచే స్థాపించబడ్డాయి.

టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ జెమ్షెడ్పూర్‌లో నత్రజని ఎరువుల ఫాక్టరీ ప్రారంభించారు. ప్రప్రథమంగా వీరు 1933 లో ఉక్కు కర్మాగారంలో ఏర్పడే అమోనియం సల్ఫేటుతో ఈ రంగంలోకి దిగారు. కేరళ ఆల్వాయ్‌లో ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్, ట్రావెన్‌కూర్ లిమిటెడ్ (FACT) 1947 లో భారీ ఎత్తున నత్రజని ఎరువుల ఉత్పాదనను ప్రారంభించింది.

భారతదేశంలో 1950 తరువాతే ఎరువుల పరిశ్రమ ప్రగతి పథంలో నడవటం ప్రారంభించింది. ప్రభుత్వంవారు ముడిపదార్థమైన బొగ్గు ఆధారంతో అమోనియం సల్ఫేటు రూపంలో 75 000 టన్నుల నత్రజని ఉత్పాదనకు సింద్రీ (బీహార్)లో సంస్థ నిర్మాణానికి నిశ్చయించారు. 1951 లో ఇది ప్రారంభింపబడింది.

1948 ఇండస్ట్రియల్ పాలసీ రెజెల్యూషన్ అనుసరించి ప్రజారంగంలో ఎరువుల తయారీ అనుమతించినా కావలసిన వసతి సౌకర్యాలు, సాధన సదుపాయాలు లేనందువల్ల ఎవరూ అంత ఉత్సాహం చూపలేదు. అప్పుడు ప్రభుత్వంవారు తమ పారిశ్రామిక విధానాన్ని 1956 లో మార్పుచేసి ఎరువుల ఉత్పత్తి రాష్ట్రప్రభుత్వాలు చేపట్టాలని, వారు ప్రజారంగంలో ఇతర ఉద్యమశీలుర సహాయం పొందవచ్చుని నిర్ణయించారు.

**జంతుజాలంలో 85 శాతం కీటకజాతికి చెందినదే**

సజీవ జంతుజాలంలో సుమారు 85 శాతం మనం చెప్పుకునే కీటక జాతికి చెందింది.

"ఒక పువ్వునో, సీతాకోక చిలుకనో రూపాన్ని బట్టి నిర్ణయించవచ్చు, మానవుని నిర్ణయించ లేము."

ప్రభుత్వంవారు తగిన చర్యలు తీసుకుని పంజాబ్ నాంగల్‌లోను, ఒరిస్సా రూర్ కేలాలో ఉక్కు కర్మాగారాలలో వరుసగా 80,000 టన్నులు మరియు 1,20 000 టన్నుల కాల్షియం, అమోనియం నైట్రేటు ఎరువుల ఉత్పాదనను ప్రారంభించారు.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలం (1956-57 నుండి 1960-61) చివరికి రెండు ఎరువుల ఫాక్టరీలు ట్రాంబాయి ట్రాంబేలోను, మద్రాసు నైవేలీలోను ప్రారంభింపబడ్డాయి. ట్రాంబాయిలో 40,000 టన్నుల $P_2O_5$, యూరియా మరియు ఇతర నైట్రోఫాస్ఫేటుల రూపంలో 90.000 టన్నుల నత్రజని ఉత్పాదన ప్రారంభించారు. నైవేలీలో నైవేలీ లిగ్నైటు ప్రాజెక్టు క్రింద యూరియా రూపంలో 70,000 టన్నుల నత్రజని ఉత్పాదన ప్రారంభింపబడింది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలాంతానికి ఎరువుల ఉత్పాదన 1951-52లో ఉత్పాదనకు 5 రెట్లు పెరిగింది.

నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌రూపంలో 1951-52లో 56,000 టన్నులు ఉన్న ఎరువుల వినియోగం 1985-86 కి 87 లక్షల టన్నులకు పెరిగింది. 30 సంవత్సరాలకు పూర్వం ఎరువులమీద ఉన్న రూ. 1.6 కోట్ల పెట్టుబడి ఇప్పుడు రూ. 8,500 కోట్లకు పెరిగింది.

భారతదేశంలో ఇప్పుడు పెద్దతరహాలో నత్రజని సంబంధమైన సంకీర్ణ ఎరువులు తయారీ సంస్థలు 50 ఉన్నాయి. మొత్తం సంవత్సరానికి 68 లక్షల టన్నుల నత్రజని, 23 లక్షల టన్నుల ఫాస్ఫేటు ఉత్పాదన శక్తి ఉంది. వీటిల్లో నత్రజనిలో 72 శాతం, ఫాస్ఫేటులో 87 శాతం వినియోగపడుతుంది.

నత్రజని ఉత్పాదనలో ప్రభుత్వ రంగానిది 49 శాతం, ప్రజారంగానిది 37 శాతం, సహకార రంగానిది మిగిలిన 14 శాతం. ఫాస్ఫేటులలో ప్రభుత్వ రంగం 39 శాతం, ప్రజారంగం 54 శాతం, సహకార రంగం 7 శాతం ఉత్పాదిస్తున్నాయి.

అభివృద్ధిపొందిన వ్యవసాయ విధానాలు, సరియైన ఎరువులు, సమతూకపు వాడకం రైతులకు చెప్పడానికి రేడియో, వార్తాపత్రికలు, సినిమా, టివీలు వంటి సాధనాలు సహకరిస్తున్నాయి.

## ఫీల్డ్‌హాకీలో మొట్టమొదటి స్వర్ణపతకం



1928 ఒలింపిక్స్‌లో నిర్వహింపబడిన ఫీల్డ్‌హాకీలో భారతీయ హాకీ జట్టు మొదటి స్వర్ణపతకాన్ని గెలుచుకుంది.

"చేసిన పొరపాటును దిద్దుకోలేనివారు రెండు తప్పులు చేసినవారవుతారు."

# క్షణం క్షణం రంగులు మార్చే ఊసరవెల్లి

ఆర్.ఎల్. ఖన్నా

జంతుజాలంలో తొండజాతికి చెందిన ఊసర వెల్లి విచిత్రమైనది. క్షణక్షణం శరీరం రంగును మార్చుకోగల అపూర్వమైన శక్తి దీనికి ఉంది. ఇది ఆహారం లేకుండా దీర్ఘ కాలంపాటు జీవిస్తుంది.



ఆఫ్రికాదేశాలలోను, మెడగాస్కర్ దీవులలోను, భారతదేశంలోను చెట్లమీద ఈ చిన్నరకం బల్లులు జీవిస్తాయి. ప్రపంచంలో 50 రకాల ఊసరవెల్లులు ఉన్నాయి. కొన్నిటికి తలమీద కవచం ఉంటుంది. లేకపోతే ముట్టిమీద ఒకటి అంతకంటే ఎక్కువ కొమ్ములు ఉంటాయి. ఇది తోకతో ఏదైనా ఒక ఆధారాన్ని గట్టిగాచుట్టి పట్టుకోగలదు. వీటికి నాలుక పొడవుగా ఉంటుంది. చివర జిగురుగలిగి లావుగా ఉంటుంది ఈ నాలుకను ముందుకు జాపడానికి వీటికి ప్రత్యేకమైన శక్తి ఉంటుంది.

మిక్కిలి వేగంతో విడుపైన నాలుకచాచి చిన్నచిన్న కీటకాలు, సీతాకోకచిలుకలు, గొల్లభామలు, మిడతలు వంటి వాటిని పట్టుకుని తింటుంది. ఆకులమీద ఉండే వర్షపు బిందువులు లేక మంచు చుక్కల వల్ల వీటికి కావలసిన నీరు లభిస్తుంది.

సాధారణంగా జతకూడే సమయంలో

(35వ పేజీ తరువాయి)

పొంటినవి. కండ మెత్తగా ఉంటుంది. పైన తొక్క చాలా పల్చగా ఉంటుంది. రసం ఎక్కువగా ఉంటుంది. ఈ రకం పళ్ళు విస్తారంగా పెద్ద పెద్ద గుత్తులుగా దిగుతాయి. ఒక్కొక్క గుత్తి ఒక్కొక్కసారి 2 కి. గ్రా. లు కూడా తూగుతుంది. ఒక్కొక్క తీగకి 100 గుత్తులు దాకా దిగుతాయి. పళ్ళు చాలా తియ్యగా ఉంటాయి వీటిలో 13-16 శాతం చక్కెరలు ఉంటాయి

'బెంగుళూరు నీలం' దీనినే 'ఔరంగాబాద్' అంటారు. ఇవి నల్లద్రాక్షపళ్ళు. మైసూరు రాష్ట్రంలో విస్తారంగా పండుతాయి. వీటికి పై తొక్క చాలా దళసరిగా ఉంటుంది. లోపల కండ కొంచెం ఆకుపచ్చ రంగులో జెల్లీలాగా ఉంటుంది. ఇవి సువాసనతో తియ్యగా ఉంటాయి. వీటిలో 15-17 శాతం చక్కెరలు ఉంటాయి. మన తెలంగాణాలో పండే అనబ్ ఎ షాహి, అధిక దిగుబడితోను, మైదానాలలో పంటకు అనుకూలంగా ఉండి ఇండియాలో లభించే అన్ని రకాలలో తలమానికమై ఉంది. "గ్రోవ్ కోర్‌మన్" బాగా రసము కలిగి పూనాలో పండుతుంది.

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

"సౌఖ్యాలు కాక కష్టాలు కూడా ప్రకృతిసిద్ధములని విశ్వసించువాడు కష్టమును చూచి భయపడడు."

మగ ఊసరవెల్లులు వింతవింత రంగులను ప్రదర్శిస్తాయి జగడమాడతాయి. తల శరీరం ముందుభాగాన్ని కదుపుస్తూ శరీరం రంగును మారుస్తూంటుంది. ఆడ ఊసరవెల్లిని ఆకర్షిస్తూంటుంది. సాధారణంగా ఒక మగ ఊసరవెల్లి ఇతర ఆడవాటిని అనుమతించినా ఇతర మగవాటిని రానీయవు.

ఆడ ఊసరవెల్లి సుమారు 30 గ్రుడ్లను పెట్టి భూమిలో చిన్న గోతిలో పాతిపెడుతుంది. క్రొత్తగా గ్రుడ్లలోనుంచి వచ్చిన ఊసరవెల్లి తెల్లగా ఉంటుంది. రెండువారాల దాకా రంగును మార్చలేదు.

ఊసరవెల్లులు విషజంతువులు కావు. 2,500 బల్లి జాతులలో అమెరికాలో నివసించే పూసలబల్లి (Beaded Lizard) మాత్రమే విషకారి. ఊసరవెల్లులు సావధానంగా, మెల్లిగా నడుస్తాయి ఆహారం వేటాడేటప్పుడు మాత్రం బహుజాగ్రత్తగా ఉంటాయి. వేటను సమీపించినకొద్దీ కళ్ళు ముందుకు వచ్చి దూరాన్ని సులభంగా గ్రహిస్తాయి.

సాధారణంగా ఒక కొమ్మమీద ఊసరవెల్లి పచ్చగా ఆకులాగే ఉంటుంది. ఇవి చెట్లమీద సులభంగా కనిపించవు. నిరపాయకరంగా సంచరిస్తాయి. విరోధిని అమాంతం మీదపడి పట్టుకుంటుంది మట్టిమీద ఉండే కొమ్మలు అంతగా ఉపయోగపడకపోయినా, ఇవి తలమీద అందంగా ఉంటాయి వాటి గొప్పతనానికి ఇవి సూచన. కొమ్ములు పెద్దవైన కొద్దీ వాటి గొప్పతనం పెరుగుతుంది

ఊసరవెల్లి బూడిదరంగు, ఆకుపచ్చ రంగులనుండి పసుపురంగు మచ్చలతో నల్ల రంగుకు కూడా మారుతూంటాయి. వాతావరణంలో కాంతి, ఉష్ణము వీటి రంగుల మార్పిడికి సహకరిస్తాయని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. ఉద్రేకం చెందినప్పుడు, భయపడినప్పుడు వీటికి రంగులు బాగా మారతాయి. ఊసరవెల్లులు తమ ప్రదేశాన్ని తాము రక్షించుకుంటాయి. ఇతర ఊసరవెల్లులను రానీయవు. జాక్సన్స్ ఊసరవెల్లి చిన్న చిన్న రాక్షసుల్లాగా ఉంటాయి. మూడు కొమ్ములు ఉన్న ఈ ఊసరవెల్లి చరిత్ర కాలానికి ముందు నివసించే ప్రాకెడి జంతువులా ఉంటుంది.

## ప్రపంచంలో మిక్కిలి సుందరమైన నగరాలు



| | |
|---|---|
| పారిస్ | —ఫ్రాన్స్ |
| న్యూయార్క్ | —యునైటెడ్ స్టేట్స్ |
| లండన్ | —యునైటెడ్ కింగ్‌డం |
| రియో డి జనీరో | —బ్రెజిల్ |
| హాంగ్‌కాంగ్ | —తూర్పు ఆసియా |
| రోమ్ | —ఇటలీ |
| మాడ్రిడ్ | —స్పెయిన్ |
| సిడ్నీ | —ఆస్ట్రేలియా |
| క్యోటో | —జపాను |
| స్టాక్‌హోమ్ | —స్వీడెన్ |

"చీకటిని పోగొట్టే దీపాలు దీపాలు కావు.
బుద్ధిమంతులకు మనస్సులో అలుముకొన్న

# అవీ-ఇవీ

## బొంబాయిలో ఇండ్ల స్థలాల ధర అత్యధికం

భారతదేశపు నగరాలన్నిటిలో బొంబాయిలో ఇళ్ళ స్థలాల ధర మిక్కిలి అధికం. బొంబాయి కొలాబాలో చదరపుమీటరు ధర



అత్యధికం రూ. 15,000, ఇతర ప్రదేశాలు ఢిల్లీలోని గ్రేటర్ కైలాస్ మరియు గ్రీన్ పార్క్ ప్రదేశాలలో రూ. 4 500 లు, కలకత్తాలో రూ. 2,243, బెంగుళూరులో రూ. 1,076, మద్రాసులో రూ. 1,345 లు, పూనాలో రూ. 1,800 లు, పాట్నాలో రూ. 1,000 లు.

* * *

## ఫ్లై అష్‌ను తిరిగి ఉపయోగించే విధానం

సిమెంట్ పరిశ్రమలో పవర్ స్టేషనులో ఏర్పడే ఫ్లై అష్ (Flyash)ను తిరిగి ఉపయోగించే విధానాన్ని ప్రవృద్ధి చేసారు. డెన్మార్కులో సిమెంట్ పరిశ్రమలలో ఫ్లై అష్‌ను ఇప్పుడు తిరిగి ఉపయోగిస్తున్నారు.

* * *

## కాంతికంటే అధికవేగంతో ప్రయాణించే కణాలు

టాకియాన్స్ (Tachyons) అనే కణాలు కాంతికంటే అధికవేగంతో ప్రయాణం చేస్తాయని సుప్రసిద్ధ ఇటలీ శాస్త్రజ్ఞుడు ప్రొ. రెకామి (Recami) తెలియజేస్తున్నాడు. అయినా ఐన్‌స్టైన్ సాపేక్షవాదాన్ని నిరాకరించలేదు. ఐన్‌స్టైన్ వాదం ప్రకారం ఏదీకూడ కాంతి వేగాన్ని మించి అధిక వేగంతో ప్రయాణం చేయలేదు.

* * *

## ఇంధనాన్ని పొదుపుచేసే పింగాణి ఇంజను

జపానులో ఇసుజు మోటారు కంపెనీ పూర్తిపింగాణి డీసెల్ ఇంజనుని అభివృద్ధి చేసింది. ఇది 30 శాతం అధికశక్తి ఇస్తూ 10 శాతం తక్కువ భారంతో 50 శాతం పొదుపును చేకూరుస్తుంది. ఇంతేగాకుండా ఇది ఏ కూలింగ్ సహాయం లేకుండా 1200° మొదలు 1500°C ఉష్ణాన్ని భరించగలదు.

* * *

## పుర్దాతో మొట్టమొదటి పైలట్

పాకిస్థాన్ ముల్తాన్‌లోని 22 ఏళ్ళ మిస్. షెహనాజ్ లెగారీ ఇస్లామిక్ దేశాలలో పుర్దాతో విమానం నడిపే మొట్టమొదటి పైలట్ అయింది. గ్రౌండ్ కోర్సు మరియు 182 గంటలు విమానం నడిపి శిక్షణ ముగించిన తరువాత ముల్తాన్ ఫ్లైయింగ్ క్లబ్

"గాయము కొంత కాలానికి మానిపోతుంది. దుర్భాషణచే ఏర్పడిన గాయము ఎప్పటికిని పచ్చిగానే ఉంటుంది."

వారు ప్రైవేట్ పైలట్ లైసెన్స్ ఆమెకు ఇచ్చారు.

* * *

ఆనంద్ - మొదటి భారతీయ గ్రాండ్ మాస్టర్

తమిళనాడు కోయంబత్తూరులో శక్తి ఫైనాన్స్‌వారు నిర్వహించిన ఇంటర్ నేషనల్ గ్రాండ్ మాస్టర్స్ చెస్ టోర్నమెంటు 12 వ ఆటలో హంగేరీ పీటర్ లూకాక్స్‌తో డ్రా అయిన తరువాత విశ్వనాథన్ ఆనంద్ మొట్టమొదటి భారతదేశపు గ్రాండ్‌మాస్టర్ అయ్యాడు.

* * *

పసిఫిక్ మహాసముద్రంలో ప్రవహిస్తున్న నది

పసిఫిక్ మహాసముద్రతలానికి 90 మీటర్ల క్రింద తూర్పు దిక్కుగా భూమధ్యరేఖ మీదుగా 5625 కి. మీల వరకు 400 కి.మీల వెడల్పుగల నదీ ప్రవాహాన్ని 1952 లో కని పెట్టారు. ఈ జలాంతర్ప్రవాహపు నది ఘన పరిమాణం యుఎస్ఎలో మిసిసిపీనది ఘన పరిమాణానికి 1000 రెట్లు ఉంటుంది.

* * *

మెక్సికోలో మినీ ఆవుల పెంపకం

మధ్య అమెరికా మెక్సికోలో ఆరు అడుగుల ఎత్తుగా ఉండి 2000 పౌండ్లు తూగే ఇండో-బ్రెజీలియన్ జీబూ (zebu) జాతి ఆవులనుండి కేవలం 2 అడుగుల ఎత్తుతో 300 పౌండ్లభారం తూగే మినీ ఆవులను జనింపజేస్తున్నారు. ఈ చిన్నరకం ఆవులు రోజుకు ఒక గాలను పాలను ఇస్తాయి.

* * *

ప్రపంచంలో మిక్కిలి పెద్ద స్విచ్ బోర్డు

వాషింగ్‌టన్ DC పెంటగన్‌లో ప్రపంచంలో మిక్కిలి పెద్ద స్విచ్‌బోర్డును చూడవచ్చు. దీనికి 25,000 లైనులు ఉంటాయి. ఈ ఫోను బిల్లుల మొత్తం సంవత్సరానికి 8.7 మిలియను డాలర్లు.

పంచదార ఉత్పాదించే మొదటి పది దేశాలు



— [illegible]





# చీకటినుంచి వెలుగులోకి

మా యోగశక్తి

ఆత్మ ప్రకాశవంతమైనది.. అన్ని దుఃఖాలకు మూలకారణమైన అజ్ఞానాన్ని పోగొట్టుకో. జ్ఞానం అనే రక్షతో పూర్తి ఆనందాన్ని అనుభవించు. కష్టాలకు భయపడిపోకు. నీవు కష్టపడితే నీ అంతరాత్మకు అతి సన్నిహితంగా ఉంటావు. హృదయం



దుఃఖకరమైన భావాలతో ప్రయాసపడిపోతూ అల్లకల్లోలమైనప్పుడే మధురాతి మధురమైన గేయాలు ఉద్భవిస్తాయి. సక్రమ మనోభావంతో దుఃఖాలను అంగీకరించగలిగినప్పుడు వ్యక్తి శక్తిమంతుడవుతాడు. విజ్ఞానం పెరుగుతుంది. వ్యక్తిలో దాగి ఉన్న శక్తి ప్రభావితమవుతుంది. సమన్వయంచే నీవు బలవంతుడవు అయితే బాధ ఉండదు. అజ్ఞానాంధకారంలో తేజోవంతమైన విజ్ఞానం ప్రకాశిస్తే అపూర్వమైన శక్తి జనిస్తుంది. నిరంతర కృషితో విజయాన్ని సుస్థిరం చేసుకోవాలి.

ఆత్మవిశ్వాసాన్ని, ప్రేమను అభ్యాసం చేసుకుంటే హృదయంలో 'సత్యం' దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది. విజ్ఞానమే సౌభాగ్యానికి రహస్యం. భగవంతునికి సేవలు చేయడంవల్ల ఎవరికి వారు సేవలు చేసుకుంటున్నారు. నీవు పరమాత్మ ఒక్కడే అనే రహస్యాన్ని తెలుసుకోవాలి. మానవులంతా ఒకే కుటుంబానికి చెందినవారు. మనమంతా 'సేవ' అనే ఒకే ధర్మంతో పుట్టాము.

మానవుడు కర్మలతోను, వాటి ఫలితాలతోను కట్టుబడి ఉన్నాడు. ఎందుకీ యాతన అని ప్రశ్నించుకునేదాకా మనం తిరిగి తిరిగి జన్మిస్తూంటాము. ఈ ప్రశ్నే తీవ్రమైన సమస్యగా పరిణమిస్తే ముక్తిమార్గంలో పరమలక్ష్యానికి బయలుదేరుతాడు. ఆనంద

14,200 అడుగుల ఎత్తున ... వివాహం చేసుకున్నారు

మయమైన ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. మనస్సు అతి సుకుమారమైనది. సులభంగా పరిసరాలనుంచి మంచిచెడ్డలు మనసులో నాటుకుపోతాయి. యోగసాధనవల్ల అంతరాత్మ ప్రబోధితం అవుతుంది. యోగాభ్యాసంవల్ల మనసులో దుస్వభావాలు అంతరించి మనస్సు సృజనాత్మకంగా ప్రవృద్ధి పొందుతుంది. మనసుకి తీవ్రమైన శిక్షణ అవసరం. గురువు సహాయంతో యోగం అభ్యాసం చేస్తే ఇది సిద్ధిస్తుంది.

మనస్సు ఎప్పుడూ చెడునే గ్రహిస్తుంది. మంచిని గ్రహించడానికి బదులు మానవులు ఋణభావంతో చింతిస్తూ బాధపడిపోతారు. మనస్సులో అనంతమైన స్వశక్తి నిబిడమై ఉందని తెలుసుకోలేరు. అహంకారంతో, దురభిమానంతో తాదాత్మ్యం చెందిపోతారు. సత్యాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించరు. సాంప్రదాయకంగా ప్రవర్తిస్తారు. ఇతరులు చెప్పినదే వేదం అనుకుంటారు. ఇటువంటి వారికి సత్యం యొక్క నిజస్వరూపం తెలియదు. వీరికి చొరవ ఉండదు. ఆకాంక్ష ఉండదు. ఇటువంటివారు ఉద్రేకంతో భావ ప్రేరితులై, ఆవేశపూరితులై ఉంటారు.

యోగాభ్యాసంవల్ల మనస్సులో శాంతి ఏర్పడుతుంది. ఆత్మ పరమాత్మల సమైక్యత కలుగుతుంది మానవునిలో ఉండే ఈ దివ్య శక్తిని సృజనాత్మకంగా నియోగించుకోలేక పోతే మనస్సు పరిపరివిధాల పరుగెత్తి వినాశకరమైన యోచనలు ప్రవృద్ధి పొందుతాయి. సక్రమ మార్గంలో యోచిస్తూ, సత్క్రియలు ఆచరించడంవల్ల ఉత్సాహం, శాంతి లభిస్తుంది.

## ఉత్సాహంగా ఉండు



ప్రభుత్వం పన్నులతో వేధిస్తున్నారని అంటాం కానీ నిర్వ్యాపారంవల్ల, వృధాకాలక్షేపంవల్ల బాధపడి పోతున్నామని చెప్పుకోం.

ఎప్పుడూ ఏదో వ్యాపారంలో ఉత్సాహంగా ఉండు. ఉపయోగంలో ఉన్న తాళం చెవి మెరుస్తూంటూంది. బద్ధకంతో కాలం గడిపితే మనస్సు తుప్పుపట్టిపోతుంది.

ఎప్పుడు పరాకులేకుండా అప్రమత్తతతో ఉండు. నిద్రపోతూన్న పిల్లులు ఎలుకలను పట్టలేవు. జాగరూకతతో ఉండు.

శ్రద్ధగా పాటుపడి పనిచేయడంవల్ల అంతా సులభసాధ్యం అవుతుంది. సోమరితనంవల్ల దారిద్ర్యదేవత పట్టుకుంటుంది. సోమరితనం నిర్భాగ్యుణ్ణిగా చేసేస్తుంది.

ఓపికతో, పట్టుదలతో, కృతనిశ్చయంతో సాధనలను చేపట్టు. నిరంతరం పడే వర్షబిందువులకు రాళ్ళు కరిగిపోతాయి. తొందరపడిపోకు అడుగుతీసి అడుగు వెయ్యాలి. చిన్న చిన్న బిందువులు చేరే మహాసముద్రాలు అవుతున్నాయి. చిన్న చిన్న గొడ్డలి పెట్లకు పెద్ద పెద్ద చెట్లు పడిపోతాయి. నిర్భాగ్యులైన సోమరులు నిద్రపోతూంటే మున్ముందు భూమిని దున్ని సౌభాగ్యవంతమైన పంట సాయం చేజిక్కించుకో.

"కళ్ళకు కనపడని దానిపైన నమ్మకం ఉంచడం భగవదిచ్ఛానం.
—సెయింట్ అగస్టిన్

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. — సంపాదకుడు]

1. పి. సురేంద్రబాబు, ఇంటర్ రెండవ సంవత్సరం, 18 సం. లు. S/o పి. నాగేశ్వరరావు, టింబర్ మర్చంట్, భాస్కర్ సెంటర్, చిలకలూరిపేట పోస్టు, (గుంటూరు జిల్లా).

నవలలు చదవడం, సినీమాలు చూడడం, కలం స్నేహం.

2. బి. శేఖర్, ఎల్‌సిఇ (ఎఎమ్ఐఇ), 22 సం.లు, ఇం.నెం. 1-2-49/హెచ్/2, చర్చికి ఎదురు, క్రిస్టియన్ కాలనీ వీధి, మహబూబ్ నగర్ - 509 001.

కలం స్నేహం, కథలు వ్రాయడం, కార్టూన్స్ వేయడం.

3. కె. భగవాన్‌రెడ్డి, ఇంటర్, 19 సం. లు, సిద్దన్నపేట, వంగునూరు పోస్టు, (మెదక్ జిల్లా) 502 280.

కలంస్నేహం, ఉత్తరాలు వ్రాయడం.

4. అర్. రంగప్ప, 27 సం. లు, టిటి ప్రైవేట్ లిమిటెడ్, సిప్‌కాట్ ఇండస్ట్రియల్ కాంప్లెక్స్, హోసూరు (ధర్మపురి జిల్లా) 635 126.

ప్రకృతి ఆరాధన, రేడియో వినడం, నవల్స్ చదవడం.

5. జోగి రవిప్రకాశ్, బి.ఎస్‌సి., C/o కుల్లాయ్‌సాహెబ్, 28/453-6, నవోదయా కాలనీ, హెడ్ పోస్టాఫీసు, అనంతపురం - 515 001.

ప్రకృతి ఆరాధన, సమాజసేవ, పత్రికా పఠనం.

6. జి. వెంకటేశ్వరప్రసాద్. 19 సం. లు. S/o జి నర్సప్ప (టీచరు), దేవరకద్ర పోస్టు, ఆత్మకూర్ తాలూకా, (మహబూబ్ నగర్ జిల్లా) 509 204.

## మార్గం తెలిసినవారు



GURU NANAK

గురువులని చెప్పుకుంటూ ఇతరుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉండేవారి సేవ చేయవద్దు. క్రమశిక్షణ ఓర్పు కష్టపడి పనిచేసే వారే జీవనోపాధిని సంపాదించుకుంటారు. ఇతరులతో దీన్ని పంచుకుంటారు. ఓ నానక్! అటువంటివారికే మార్గం తెలుసు.

—గురునానక్

"చెడు క్షణంలో వ్యాప్తి పొందుతుంది. మంచి మన్వంతరాలకైనా వ్యాప్తిపొందదు."

క్రికెట్ ఆడడం, వార్తాపత్రికలు చదవడం, టెన్నిస్ ఆడడం.

7. ఆర్. మాలకొండయ్య. ఇంటర్ సీనియర్, 21 సం లు, అరుణోదయా న్యూ రెసిడెన్షియల్ కాలేజి, రామలింగపురం గ్రామం, కనిగిరితాలూకా, (ప్రకాశం జిల్లా) 523 230.

రేడియో వార్తలు వినడం, అక్రమాలను అరికట్టడం.

8. ఎ.అప్పారావు, (బి.ఏ.)., 20 సం. లు, S/o సూర్యనారాయణ. ఎ. పి.కే మల్లావరం, పిఠాపురం తాలూకా (తూ.గో జిల్లా)

నవలలు చదవడం, షటిల్ ఆడటం.

9. సి. హెచ్. వెంకట్‌కృష్ణా రెడ్డి, బి.ఏ. రెండవ సంవత్సరం (లిట్), ఇం. నెం. 4-148, సరూర్ నగర్, హైదరాబాద్ 500 035.

పురాతన ప్రదేశాలను దర్శించడం, ప్రకృతి ఆరాధన, కలంస్నేహం.

10. కె. తిరుమలరావు. 20 సం. లు, మాథ్స్‌టీచర్, బాపు విద్యానికేతన్, కురుమ పోస్ట్, (విజయనగరం జిల్లా) 532 525.

ప్రేమను ఆరాధించడం, కవితలు వ్రాయడం, భావచిత్రాలు వేయడం.

11. డి. విజయ. ఇంటర్ రెండవ సంవత్సరం, 18 సం లు, C/o డి బి విజయరాజు, పి.ఎస్ బి. బాయిస్ హాస్టల్ దగ్గర, ఆలూర్, (కర్నూలు జిల్లా) 518 395.

క్రికెట్ చూడడం, ప్రకృతి ఆరాధన, చదరంగం ఆడటం.

12. సి హెచ్ యాదగిరి, ఎస్ఎస్ సి, 22 సం లు, S/o వీరయ్య, ఇ. నెం. 993, న్యూ బాలాజీ పవర్ లాండ్రి. పద్మ నగర్, భీవాండి, ఠానాజిల్లా, (మహారాష్ట్ర) 421 302.

వ్యాయామ క్రీడలు, విజ్ఞానం పెంపొందించుకోడం.

## సూర్యుని వయస్సు 4,600 మిలియను సంవత్సరాలు



బొంబాయి ఇన్‌స్టిట్యూట్ ఫర్ ప్రొఫెషన్స్ ఆఫ్ ఫిజిక్స్, డైరక్టరు ప్రొఫెసర్ దివాన్ శ్రీకంఠన్ సూర్యుని వయస్సు తెలుసుకోడానికి సూర్యుని నుంచి ప్రసరించే గామా కిరణాల మీద పరిశోధనలు చేసి, సూర్యుని వయస్సు 4,600 మిలియను సంవత్సరాలు అని నిర్ధారణ చేశారు. దీనికి పూర్వం సూర్యుడు 6,000 మిలియను సంవత్సరాల నుంచి ఉన్నట్లు అభిప్రాయపడ్డారు.

— యోజన సౌజన్యంతో

"ధర్మబద్ధమైన ఆలోచనల వలన మనసుకు శాంతి,
అధర్మమైన ఆలోచనల వలన అశాంతి."

# మిరప పుట్టుపూర్వోత్తరాలు

రాఘవేంద్రరావు

మనం ప్రతినిత్యం వంటకాలలో వాడుకునే సంబార ద్రవ్యాలలో ముఖ్యమైనది మిరప. ఆంగ్లంలో దీనిని చిల్లీ (Chilli) అంటారు. వృక్షశాస్త్ర రీత్యా దీనిని 'కేప్సికమ్ ఫ్రూట్‌సెన్స్' (Capsicum Frutes-



cens) అంటారు. వీటిలో రెండు రకాలు ఉన్నాయి. ఏకవార్షికములు, బహువార్షికములు. కేప్సికమ్ అమ్యుయిమ్ ఏకవార్షిక జాతికి, కేప్సికమ్ ఫ్రూటసెన్స్ బహువార్షిక జాతికి చెందినది. పశ్చిమదేశాలలో దీనిని గార్డెన్ పెప్పర్ (Garden Pepper) అంటారు. ఇది మిరియాలు కాదు మిరియాలను బ్లాక్‌పెప్పర్ అంటారు. ఇది పైపర్ నిగ్రుమ్.

అమెరికనులు దీనికి పెప్పర్ (Pepper) అనే పేరు పెట్టారు. కొలంబస్ వెస్ట్ ఇండీస్‌లో నివసించేవారు దీనిని పండించి ఎర్రని మిరపకాయలను ఉపయోగించటం చూశాడు మిరియంలాగా కారంగా ఉంటుంది కాబట్టి పెప్పర్ అన్నారు.

మిరపకాయకు మనం ఇచ్చిన 'చిల్లీ' అనే పేరు స్పెయిన్ నుంచి వచ్చింది. ఇది మొట్టమొదట 1493 లో అక్కడ ప్రవేశపెట్టబడింది. ఇది కొలంబస్ కాలంకంటే చాలా పురాతనమైన కాలానికి చెందినది.

2000 సంవత్సరాలనాటి పెరూ శిథిలాలలో మిరపకాయలు కనుగొనబడ్డాయి. దక్షిణ అమెరికా అల్‌మెక్స్, టోల్‌టెక్స్, అజ్‌టెక్స్ వంటలలో మిరపను ఉపయోగించినట్లు తెలుస్తుంది. ఆ తరువాత దీనిని మెక్సికో, మధ్య అమెరికా మరియు చైలీ ప్రాంతాలలో విస్తారంగా పండించేవారు.

చైలీనుంచి ఇది స్పెయిన్‌కు వచ్చింది. చైలీనుంచి వచ్చింది గాబట్టి స్పెయిన్ భాషలో దీనిని 'చిల్లీ' అన్నారు. 1548 లో ఇంగ్లండులోను, 1585లో మధ్య యూరప్‌లోను ప్రవేశించింది. 17 వ శతాబ్దంలో పోర్చుగీసువారు మిరపను భారతదేశంలోను, ఆగ్నేయ ఆసియాలోను ప్రవేశపెట్టారు.

ఎరుపు, ఆకుపచ్చ, పసుపు మిరపకాయలలో పౌష్టిక పదార్థాలు చాలా ఉంటాయి. ఎండు మిరపకాయల పౌష్టికశక్తి 100 గ్రాములకు 250 కెలోరీలవరకు ఉంటుంది. ఎండు మిరపలో మాంసకృత్తులు, ఖనిజములు తృణధాన్యాలలో కంటే అధికంగా ఉంటాయి. విటమిను A, C లు ఎక్కువగా ఉంటాయి. మైసూరు, బళ్ళారి, మహా

"ఈశ్వరుడు, విశ్వం, వాస్తవం కానీ కాక పోనీ, ఎవరికి వారు వాస్తవం."

రాష్ట్రి మొదలైన ప్రాంతాలలో పండింప బడేవి "కె. ఎ." రకము.

ఎక్యూమినేటమ్ అనే రకం సన్నగా పొడవుగా ఉంటాయి. కొనవారి పెలికలు తిరిగి ముడతలు పడిపోయి ఉంటాయి. గుంటూరు ప్రాంతాలలో 'లాంగమ్' పండి స్తారు. ఇవి పెద్దవి. చర్మం దళసరిగా ఉంటుంది. కాయ ముచికభాగం దగ్గర బాగా వెడల్పుగా ఉంటుంది. 'గ్రోసమ్ అనే రకం కూర చేసుకోడానికి ఉపయోగిస్తారు. కాయలు చాలా పెద్దవి. లావుగా ఉండి ఒక్కొక్కటి 50 మొదలు 80 గ్రాములు తూగుతుంది. ఎక్కువ శీతల ప్రదేశాలలో పెరుగుతుంది. కారం ఉండదు. ఇవి నిగనిగలాడే ఎర్ర రంగుగా పండుతాయి. కొన్ని పంగపండు రంగులో ఉంటాయి నేరేస్‌ఫార్మ్ చిన్న చిన్న రేగుపళ్ళలా ఉంటాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో గోదావరి, కృష్ణ, వరంగల్ జిల్లాలలో ఎరుపు రంగు గల లావుపాటి పొడవైన కాయలను పండిస్తారు. వీటిపై చర్మం బాగా దళసరిగా ఉంటుంది. బహు వార్షిక రకాలు ఇండ్లో పెరళ్ళలో పెంచు కుంటారు. చిన్న చెట్టు గుబురుగా పెరుగు తుంది. వీటి ముచికలు కాయలకన్నా పొడవుగా ఉంటాయి. కాయలు చాలా చిన్నవి. సన్నగా ఉండి ఊర్ధ్వముఖంగా ఉంటాయి. కొన్ని బటాణీ గింజంత ఉంటాయి. వీటికి కారం చాలా అధికం. తొక్కపలచన గింజలు అధికం. సాధార ణంగా దీనిని పీమమిరప అంటారు. సంవ త్సరం పొడుగునా వస్తాయి 5, 6 సంవత్స రాలు బ్రతుకుతాయి. ఇవిగాకుండా అనంత పురం జిల్లాలో అక్కడక్కడ తీగ మిరప కూడా ఉంది ఇదీ 4 5 సంవత్సరాలుపాటు సంవత్సరం పొడవునా కాయలు కాస్తుంది.

మిరపకాయలను రుచికి వాడతారు. పొడి గొట్టి ఊరగాయలకు ఉపయోగిస్తారు. మిరప కాయలు కారంగా, ఘాటుగా ఉండడానికి దాంట్లో ఉండే కాప్సేసిన్ ముఖ్యకారణం.

మిరప మితంగా వాడితే జీర్ణకారిగా ఉపయోగపడుతుంది. మిరప జఠర దీప్తిని కలిగిస్తుంది. ఆయుర్వేదరీత్యా మిరప వేడి చేస్తుందంటారు. వాతానికి చాలా మంచిది. మంచి జీర్ణకారి. ఉత్తేజకాలుగానూ, దాహ జనకాలుగాను వాడతారు. నోటిని శుభ్రపరచ డానికి గార్గుల్స్ తయారీలో కూడా దీనిని ఉపయోగిస్తారు.

## ప్రేమానురాగాలు గలవారే వైద్యులు



వైద్యుడు ప్రేమ, అనురాగము, సేవ అనే గుణాలు కలిగి ఉండాలి. ఇవి లేని వైద్యులు వైద్యవృత్తిని విరమించుకోడం ఉత్తమం. —మదర్ థెరీసా

"శ్రమించి పని చేసిన శ్రామికుని ఘర్మజలం ఆరకముందే ప్రతిఫలం ముట్టచెప్పాలి."

# పళ్ళు తినడంలో కొన్ని మెళుకువలు

కెవిజె గన్‌పతిసింగ్ వర్మ

ఆహారంలో కంటే పళ్ళకు పాలతో మంచి పొందిక ఉంది. పళ్ళు కాయగూరలతో కలిపి తినడం మంచిది కాదు. పళ్ళను తిని వాటివల్ల పూర్తి లాభాన్ని పొందాలంటే వాటిని విడిగా తినాలి, రోజూ తినే ఆహారం



తోపాటు తినవలసివస్తే మొత్తం మీద పళ్ళనే ఎక్కువగా తినాలి. రొట్టె, పాలు, కూరగాయలతో కడుపు నిండినప్పుడు పళ్ళు తింటే ఆయాసం అనిపిస్తుంది. ఈ విధంగా తిన్న పళ్ళు ఆశించిన ఫలితాన్ని ఇవ్వవు.

ఒక్కొక్కసారి ఒకే రకం పండు తినాలి. మీవు ఇప్పుడు ఒకరకం పండు తింటే దాంతోపాటు ఇంకోరకంపండు తినకూడదు.

పండ్లవల్ల అత్యధిక లాభాన్ని పొందాలంటే కడుపు ఖాళీగా ఉన్నప్పుడు తినడం శ్రేష్ఠం పొద్దుటిపూట, మధ్యాహ్నం పళ్ల తిని రాత్రిపూట రొట్టె పాలు తినడం ఉత్తమం. ఏదైనా మితిమీరి తినడంవల్ల అనారోగ్యం సంభవిస్తుంది. పండ్ల విషయంలోనూ అంతే.

## ప్రపంచపు 14 శిఖరాలు ఎక్కిన రెండవ ఘనుడు

తూర్పు యూరప్‌లో పోలండ్‌కు చెందిన 39 సంవత్సరాల జెర్జీ కుకుజ్ కాటోవైస్‌లో ఎలక్ట్రీషియనుగా ఉన్నాడు. ఇతడు ప్రపంచంలో 8,000 అడుగులకు పైబడిన సుప్రసిద్ధ 14 పర్వత శిఖరాలను ఎక్కి మహాద్భుతాన్ని సాధించిన రెండవ ఘనుడు. ఇటలీకి చెందిన రియన్ హోల్డ్ మెస్నెర్ ఈ మహాద్భుత కార్యం సాధించిన మొదటి వ్యక్తి.

## రాతి స్తంభాల నున్నని నునుపు

272–232 బిసిలో అశోకచక్రవర్తి నిర్మించిన రాతి స్తంభాల నున్నని నునుపు చెక్కుచెదరకుండా నేటికి ధగధగా ప్రకాశిస్తుంది. భారతదేశంలో ఏనాడో నిర్మింపబడిన 40–50 అడుగుల ఎత్తుగల ఈ బ్రహ్మాండమైన రాతి స్తంభాలకు ప్రాచీన శిల్పకారులు ఉపయోగించిన వస్తువులు గానీ, వారి పని తీరుగానీ సాంకేతిక ప్రగతిని పొందిన ఆధునిక వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు వివరించలేకపోతున్నారు.

"సంతోషంగా అనురాగంతో జీవించు, ఆచరించు. ఈ రెండేచాలు. మోక్షం తప్పక లభిస్తుంది." —శ్రీ సత్యసాయిబాబా

# మంత్రం జపిస్తే మనస్సు నిష్కలంకం అవుతుంది

మనసులో దురహంకార పరిపూరితమైన పశుత్వాన్ని పోగొట్టుకోడానికి రామమంత్రం గానీ, మరేదైన ఇతర మంత్రంగానీ చాలా ముఖ్యం ఎవరికి ఇష్టమైన మంత్రం వారు జపించుకోవచ్చు. చిన్ననాటినుంచి ఏ కష్ట



మొచ్చినా నేను రామమంత్రం జపించేవాడిని. అది నాకు చాలా పరిచయమైనది. అందువల్లే రామమంత్రం జపించమని చెప్పాను.

మంత్రం వ్యక్తి జీవితానికి ముఖ్యమైన ఆధారం అవుతుంది. జీవితంలో సంభవించే కష్టాలను తరింపజేస్తుంది. ఇటువంటి పవిత్రమైన లౌకిక మంత్రాలద్వారా లౌకికమైన లాభాన్ని పొందాలి వ్యక్తిగతమైన నిష్కళంక హృదయానికి మంత్రం రక్ష. వివేకవంతులు దీనిని గ్రహించాలి. చిలుకలాగా మంత్రాన్ని ఊరికే నోటితో జపించకూడదు. చిత్తశుద్ధితో మనసారా జపించాలి. మాట్లాడే చిలుకకు నేర్పిస్తే యాంత్రికంగా మంత్రాన్ని జపిస్తుంది. వివేచనాభావంతో మనలో ఉండే అవాంఛనీయమైన భావాలను పారద్రోలేటట్లు మంత్రశక్తిని పూర్తిగా విశ్వసిస్తూ మంత్రాన్ని జపించాలి.

— మహాత్మా గాంధీ

## వీధిలో 'బెస్ట్ టైలర్'

ప్రతి వీధిలో ప్రతి మూల ఎన్నో అనుకూలాలు, అవకాశాలు. మనం ఎక్కడికో వెళ్ళక్కరలేదు ఉపకారం చేద్దాం అనుకుంటే. ఒకే రోజున ముగ్గురు టైలర్లు బయలుదేరి ఒక వీధిలో ఉండడానికి నిశ్చయించుకున్నారు. మరునాడు వారిలో ఒకడు తన ఇంటి తలుపుకి 'ఊర్లో ఉత్తమ టైలర్' అని బోర్డు తగిలించాడు. ఆ మరునాడు రెండవ టైలర్ 'ప్రపంచంలో ఉత్తమ టైలర్' అని బోర్డు తగిలించాడు.

మూడవ టైలర్‌కి అనుమానం వచ్చింది. 'ప్రపంచంలో ఉత్తమ టైలరును మించి ఉండడం ఎలా' అని ఆలోచించాడు. చివరకు నవ్వుకుంటూ సంతోషంతో 'వీధిలో మంచి టైలరు' అని పేరు పెట్టాడు. ఇక చూడండి జనం తండోపతండాలుగా రావడం మొదలు పెట్టారు. ఈ టైలరుకి గిరాకీ పెరిగింది.

చుట్టుపక్కల జరుగు పోవుగువారికి ప్రస్తుతం నీవు ఇక్కడ ఏం చేస్తున్నావనేది ముఖ్యం.

"మహనీయుల ఘనతపై విశ్వాసం ఉండకపోవడంలోనే సామాన్యుల అల్పబుద్ధి వెల్లడవుతుంది."

—కార్లైల్

# విజ్ఞానవేదిక

## మురికినీరు - శుద్ధీకరణ

పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలలోను, ఫాక్టరీలలోను వాడిన మురికి నీటిని జలాశయాలలోకి వదిలేటప్పుడు దానిలో చేరి ఉన్న మలినపదార్థాలను వేరుచేసి తొలగించాలి. సాధారణంగా నదులలోకి, చెరువులలోకి, ఇతర జలాశయాలలోకి పారించే ముందు మురికినీటిని పూర్తిగా పరిశుభ్రం చేయడం లేదు. నదీ జలాలలోను, ఇతర గృహోపయోగాలకు వాడుకునే జలాశయాలలోను కాలుష్యాలు చేరి నీరు మరింత కాలుష్యం చెందకుండా ఉండాలంటే వాటిలో పారించే మురికినీటిని విస్తృత విధానంలో నిష్కల్మషం చేయాలి.



మురికి నీటి శుద్ధీకరణ విధానం ప్రాచీన కాలంలో 2000 బి.సి. లోనే ఉన్నట్లు మన సంస్కృత గ్రంథాలలో ఉంది. పెద్ద పెద్ద రాగి దేగిసాలలో ఆరుబయట మంచి ఎండలో మురికి నీటిని మరగబెట్టి ఆ మరిగిన నీటిని బొగ్గుగుండా వడకట్టి మట్టి కుండలలోనో, బావులలోనో చల్లార్చేవారు.

ఇప్పటికీ మురికినీటి పరిష్కార సౌకర్యాలు లేని చిన్న చిన్న గ్రామాలలో ఈ నీటిని పెద్ద పెద్ద గోతులలోకి పారిస్తారు. ఇప్పుడు పెద్ద పెద్ద సంస్థలలో మురికినీటిని సెడిమెంటేషన్ టాంక్స్‌లోకి పారిస్తారు. ఈ టాంకులోకి మురికినీటిని నెమ్మదిగా అతి మెల్లిగా పారించినప్పుడు ఆ నీటిలో ఉండే మలినాలు, కల్మషాలు క్రిందికి దిగుతాయి. చెత్తచెదారం లేని నీరు పైకి తేరుతుంది. పైకి తేరిన నీటిని వడకట్టి జలాశయాలలోకి వదులుతారు.

### అధిక వ్యాప్తి గల అంటురోగం

పిల్లలను, పెద్దలను కూడా చంపే ప్రాణాపాయకరమైన మాలిగ్నెంట్ మలేరియా ప్లాస్మోడియా ఫాల్సిపారమ్ ఆఫ్రికా మరియు ఆసియా, హిందూదేశం, పసిఫిక్ దీవులు మరియు దక్షిణ అమెరికాలో ప్రబలి పోయింది. ప్రపంచం మొత్తంమీద ప్రతి సంవత్సరం 200 మిలియను రక రకాల మలేరియా రోగగ్రస్తులలో 2 మిలియను మంది మరణిస్తున్నారు. ఇది ప్రపంచంలో అధిక వ్యాప్తిచెంది తీరని అంటురోగ సమస్యగా పరిణమించింది.

"మానవుడు తనను గురించి తప్ప ప్రపంచంలో
... విషయాలను గురించి తెలుసుకుంటాడు."

సాధారణంగా ఉపయోగించే వడపోత విధానం 'రోటరీస్ప్రింక్లర్' పద్ధతి. వరుసగా ఒకదానిపై ఒకటి ఇసుక కంకర పొరలుగల వర్తులాకారపు తొట్లలోకి మెల్లిగా తిరుగుతున్న గొట్టాల రంధ్రాలద్వారా నీటిని పారిస్తారు.

మురికినీటిని విష్కల్మషం చేయడానికి 'ఆక్టివేటెడ్ స్లడ్జి' విధానం మరొకటి ఉంది ఈ విధానంలో మురికినీటిని పెద్ద పెద్ద తొట్టెలలో నిలువ చేస్తారు. పై తేట నీటిని జలాశయాలలోకి వదులుతారు. ఈ నీరు నదులలో కలవడానికి కొంతవరకు విష్కల్మషమైనా త్రాగడానికి ఆరోగ్యకరమైనది కాదు.

పారిశ్రామిక సంస్థలలోను, ఫ్యాక్టరీలలోను ఉపయోగించిన తరువాత వ్యర్థంగా వదిలే నీటిలో ఆరోగ్యానికి అపాయకరమైన రసాయనిక పదార్థాలు చేరి ఉంటాయి ఇటువంటి నీటిని విష్కల్మషం చేయకుండా నదులలోకి, జలాశయంలోకి వదలడం నేరంగా పరిగణించి, చట్టబద్ధం చేస్తే నీటి కాలుష్యం కొంతవరకూ తగ్గుతుంది.

—'సెంటర్ ఫర్ ఎన్విరాన్మెంట్ ఎడ్యుకేషన్' సౌజన్యంతో

## భారతదేశంలో నిర్మించబడిన బ్రహ్మాండమైన యుద్ధనౌక

భారతదేశంలో నిర్మించబడిన బ్రహ్మాండమైన యుద్ధనౌక ఐ.ఎన్.ఎస్. మాగార్ (I.N.S Magar) ప్రపంచంలో ఉత్తమోత్తమమైన యుద్ధనౌకలతో సరిసమానంగా ఉంటుంది.

## చంద్రునివల్ల వాతావరణంలో మార్పులు వస్తాయా?



చంద్రునివల్ల భూమిమీద వాతావరణంలో ఏ మార్పులు రావు. సముద్రంలో ఆటు. పోటు మాత్రం కలుగుతుంది

—'మిషా' సౌజన్యంతో

## తళుకులు

అధికారానికి దుర్నీతికి సన్నిహిత సంబంధం ఉంది.

అధికారం—దుర్నీతి రక్తసంబంధం గల దగ్గిర బంధువులు.

* * *

సత్యం చెప్పేవారికి వేదిక కనిపించదు.

* * *

తల్లిని చూచి కూతురిని పెళ్ళి చేసుకోమన్నారు (పాతరకం).

తండ్రిని చూచి కూతురిని పెళ్ళి చేసుకోమన్నారు (కొత్తరకం).

"దేశంలో ధర్మం నశించినప్పుడు దేశం పూర్తిగా నశిసుంది."

# బాధ కలిగినప్పుడే భగవంతుడు

చాలామందికి అసలు ధర్మం అక్కర లేదు. సౌఖ్యంగా జీవించడమే వారి నైజం. వారికి భక్తి అంటే తెలియదు. ఎలాగో అలాగ ఏదోవిధంగా సంపాదించ గలిగినంత ధనం వారు సంపాదించుకుంటారు.



క్రిందా మీదా పడి పట్టా సంపాదిస్తారు. డిప్లమా సంపాదిస్తారు. సమాజంలో ఒక అంతస్తు హోదా పొందుతారు.

జీవితంలో పవిత్రమైన ఉన్నత పదవిని పొందడానికి వారికి ఆశలు, ఆశయాలు ఉండవు. ఆత్మనిగ్రహం, ఓర్మి, శాంతి, పరిత్యాగం, ఏకాంతత, భక్తి, సామాన్య జీవితం, ప్రార్థన, ధ్యానం, ఉపాసన, గీతా ధ్యయనం, ఉపనిషత్పఠనం అంటే అప హ్యాంచుకుంటారు. అపాయకరమైన చిక్కులలో తగులుకున్నప్పుడు, కుదరని జబ్బులతో బాధపడుతున్నప్పుడు, పయాపైసా చేతిలో లేక దారిద్ర్యంతో బాధపడుతూన్నప్పుడు భగవంతుడు, భక్తి, యోగులు, మహాత్ములు జ్ఞాపకం వస్తారు. ఏ ధర్మసంస్థలోనైనా, ఏ సాధువు దగ్గరైనా ఏదైనా మూలిక దొరుకుతుందా, విభూతి దొరుకుతుందా అని ప్రాధేయ పడతారు. కష్టాలు సంభవించినప్పుడు ప్రాపంచిక సుఖాలనుకోరే లౌకికులకు కూడా ధర్మసంస్థల అవసరముందని తెలుస్తుంది.

స్వార్థపరత్వంతో ఖర్చు చేయకుండా జీవించేవాని జన్మ వ్యర్థం. హృదయంలో ఔదార్యంలేని వాని జన్మ వ్యర్థం. దయా దాక్షిణ్యం లేనివాని జన్మ వ్యర్థం. నీతి నియమం లేని వాని జన్మ వ్యర్థం. ధ్యానం చేయనివాని జన్మ వ్యర్థం. ధర్మసంస్థలకు సహాయం, సేవ చేయనివాని జన్మ వ్యర్థం. వినయం, విధేయత, మర్యాద లేనివాని జన్మ వ్యర్థం. —స్వామీ శివానంద

## పునుగుపిల్లి కస్తూరి వాసనగల పదార్థాన్ని ఉత్పాదిస్తుంది

క్షీరదముల జాతికి చెందిన పునుగుపిల్లి ఆఫ్రికా ఉష్ణప్రదేశాలలోను, ఆసియాలోను నివసించే మాంసాహారి. కస్తూరి వాసన గల క్రొవ్వు పదార్థాన్ని ఉత్పాదిస్తుంది. దీనిని అమూల్యంగా పరిగణిస్తారు. తోకకు దగ్గిరగా ఉండే సంచుల నుండి దీనిని గ్రహించి అనేక సువాసన వస్తువుల తయారీకి ఉపయోగిస్తారు. వారానికి ఏ రెండు మూడు చుక్కలు మాత్రమే ఈ పిల్లి నుండి గ్రహిస్తారు. కానీ అత్తరులు తయారుచేయడానికి వేలకొద్దీ బొమ్మలు ఉపయోగిస్తారు.

"చేస్తూన్నా పోట్లాడేది కుమారుడు, పోట్లాడుతున్నా చేసేది తల్లి." —అమ్మ

# షేక్‌స్పియర్ గ్రంథావళి

రోమియో అండ్ జూలియెట్ అనే ఇద్దరు రసికులు పరస్పరం ప్రేమించుకున్నారు. వీరిద్దరు ఒక హేమ్‌లెట్‌లో నివసిస్తూండే వారు. వీరి వివాహం ట్వెల్త్ నైట్‌న జరగడానికి నిశ్చయమైంది. టు జెంటిల్‌మెన్ ఆఫ్


Shakespeare

వెరొనా ఇద్దరు పెద్దలు. వీరు మర్చంట్ ఆఫ్ వెనిస్ నుండి ఉంగరాన్ని తీసుకు వచ్చారు. ఈ వివాహంలో మెర్రీవైవ్స్ ఆఫ్ విన్‌డ్సర్ వంటలు వండారు. కింగ్‌లియర్, జూలియస్ సీజర్ ముఖ్య అతిధులు. అంటోనీ అండ్ క్లియోపాత్రా ముఖ్య దంపతులు. వీరి వివాహ జీవితం మిడ్ సమ్మర్ నైట్స్‌డ్రీమ్స్ అంత ఉల్లాసవంతంగా ఉంది. వాస్తవిక జీవితం ప్రారంభమైంది. వరుడు "ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ" ఎదుర్కోవలసి వచ్చింది. వారి ప్రేమమందిరంలో గొప్ప టెంపెస్టు చెలరేగింది. చివరగా వధువు తమ్ముడు ఒథెల్లో సహాయంతో మచ్ ఎడూ ఎబౌట్ నథింగ్ అని తెలుసుకున్నారు. హాయిగా కాపురం ప్రారంభించారు. "ఆల్ ఈస్ వెల్ దట్ ఎండ్స్ వెల్."

## విల్సన్ కనిపెట్టిన క్రొత్త తోకచుక్క

యునైటెడ్ స్టేట్స్‌లో కాలిఫోర్నియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన ఖగోళశాస్త్రం అభ్యసించిన గ్రాడ్యుయేటు క్రిస్టినీ విల్సన్ హేలీ తోకచుక్కను మించిన ఒక క్రొత్త తోకచుక్కను కనిపెట్టాడు.

## నేడు అధిక జనసాంద్రత గల దేశాలు

| | | |
|---|---|---|
| చైనా | - | 108,70,00,000 |
| భారతదేశము | - | 81,88,00,000 |
| సోవియెట్ యూనియన్ | - | 27,59,00,000 |
| యునైటెడ్ స్టేట్స్ | - | 24,61,00,000 |
| ఇండోనేషియా | - | 17,74,00,000 |
| బ్రెజిల్ | - | !4,44,00,000 |
| జపాన్ | - | 12,27,00,000 |
| నైజీరియా | - | 11,18,00,000 |
| బంగ్లాదేశ్ | - | 10,95,00,000 |
| పాకిస్థాన్ | - | 10,75,00,000 |

—పాపులేషన్ రిఫరెన్స్ బ్యూరో, వాషింగ్‌టన్, యుఎస్ఎ

"అంతా మాయ అయినా, మానవుని సుఖ దుఃఖానుభవం ఆ సమయానికి నా వాస్తవం."

# మూడవ పారిశ్రామిక విప్లవం

డి. ఎస్. పటోడియా

వార్తా, సమాచార, మరియు రాబోటుల రంగాలలో అద్భుతమైన ప్రగతులు ఏర్పడ్డాయి. ఈనాడు లెక్కలేనన్ని వార్తలను, సమాచారాలను సంగ్రహించి పెట్టుకుని కంప్యూటర్ల ద్వారా తెలుసుకోడానికి వీలు కలుగుతూంది. ఈ కంప్యూటర్లు మిక్కిలి సామర్థ్యవంతంగా రూపొందుతున్నాయి. పరిమాణంలో చాలా చిన్నవి. అతి శక్తివంతమైనవి. వెల తక్కువ.



ఒక చిన్న చీమకు రెండింతలుండే అతి సున్నితమైన 'చిప్'లో 54,000 వివరాలు ఉంటాయి. సెకండులో 170 బిలియను భాగం వ్యవధి కంటే తక్కువ కాలంలో అవసరమైన వారికి వివరాలను అందిస్తుంది.

జపానులో MITI అనే సంస్థ వచ్చేకొద్ది సంవత్సరాలలో మూడవతరం రాబోట్ల తయారీకి 100 మిలియన్ డాలర్లు ఖర్చు చేస్తుంది. ఈ రాబోట్లను సీయింగ్ రాబోట్లని, టచింగ్ రాబోట్లని, వాకింగ్ రాబోట్లని మూడు రకాలుగా వేరుచేయవచ్చు. సీయింగ్ రాబోట్లు జంతువులను అనుకరిస్తాయి. టచింగ్ రాబోట్లకు స్పర్శజ్ఞానం ఉంటుంది. వాకింగ్ రాబోట్లు జారిపడిపోతాయనే భయం లేకుండా ఎటువంటి తలంమీదైనా అతి సౌలభ్యంగా నడిచిపోతాయి.




బాగా అభివృద్ధిపొందిన విధానాలు అనుసరింపబడుతున్నాయి కాబట్టి వార్తా సమాచార సంపర్క సంబంధాలు మరింత సన్నిహితం అవుతున్నాయి. ఇకమీద వెలుగు కిరణం ప్రసారయానంగా ఉండదు. వచ్చే కొద్ది దశాబ్దాలలో వార్తలు లేసర్ కిరణ సహాయంతో ప్రసారమవుతాయి. లేసర్ కిరణాలు మిక్కిలి సన్నవి పారదర్శిక గ్లాసు ఫిలమెంటుద్వారా ప్రసారమవుతాయి. ప్రపంచంలో ఎక్కడైనా ఏ మూలైనా జరిగే విషయం ప్రపంచం అంతా కొన్ని నిముషాలలో ప్రసారం చేయవచ్చు.

ట్రాన్స్‌పోర్టులో విపరీతంగా అభివృద్ధి ఏర్పడుతుంది. ఒకచోట నుంచి మరోచోటుకి అతి సౌలభ్యంగా, అతి శీఘ్రంగా ప్రయాణం చేయవచ్చు. దూరం అనేదే లెక్క ఉండదు.

"నీకు తోచనిదీ, కనబడనిదీ కవి చెప్పిన తరువాత
నీ అనుభవంలోకి ఎంతో కొంత వచ్చేదే నీకు సరిపడే కవిత."

కొద్ది గంటలలో ప్రపంచంలో ఒకచోట నుంచి మరోచోటుకి ప్రయాణం చేయవచ్చు.

జెనిటిక్ టెక్నాలజీవల్ల పంటలు తమకు కావలసిన ఎరువులను అవే తయారు చేసు కుంటాయి. వట్టి బీడు ప్రదేశాలలో, చవిటి నేలలో కూడా పంటలు బాగా పండుతాయి. వైద్యరంగంలో జెనిటిక్సును ప్రవేశింప



చేయడంవల్ల అపాయకరమైన కాన్సరు, గుండెజబ్బులు వంటి రోగాలకు మంచి అభి వృద్ధి పొందిన చికిత్స లభిస్తుంది. క్రొత్త క్రొత్త సామర్థ్యవంతమైన మందులు అతి చౌకగా లభిస్తాయి. పారిశ్రామిక రంగంలో జెనిటిక్ ఇంజనీరింగ్ ప్రవేశింపజేయడంవల్ల ఉత్పాదనలకు క్రొత్త వస్తువులను కనిపెట్టు టయేగాక కాలుష్యాలు నిరోధింపబడతాయి.

భూమి స్థిరకక్ష్యలో పెట్టిన సౌర ఉప గ్రహంవల్ల భూతలం 30 రెట్లు అధికమైన వెలుతురుని గ్రహిస్తుంది. సౌరశక్తి విధా నంలో ఉపగ్రహం మనం సూర్యుని నుంచి పొందే సౌరశక్తికి నాలుగురెట్లు అధిక శక్తిని గ్రహిస్తుంది. భారతదేశం వంటి దేశంలో సౌరశక్తి సంబంధమైన ఉపగ్రహాల వల్ల దేశంలో విద్యుచ్ఛక్తి 40 శాతం పెరుగుతుంది.

కానీ ఈ లక్ష్యాలను సాధించడానికి ప్రపంచంలో కొన్ని అభివృద్ధి పొందుతూన్న మరియు పేద దేశాలలో పెరిగిపోతూన్న జనాభా అంతరాయం కలిగిస్తుంది. ప్రపంచ బాంక్ వారి లెక్కల ప్రకారం 1950 లో ఉన్న 2502 మిలియను జనాభా, 1982 లో ఉన్న 4588 మిలియను జనాభా, 2025 లో బ్రహ్మాండంగా 8195 మిలియనుకు పెరిగి పోతుంది. భారతదేశంలో నేడు ఉన్న 750 మిలియను జనాభా 2025 సం.కి 1311 మిలి యనుకు పెరుగుతుంది.

నూతన అభివృద్ధులతో సమాజం మనం కనీవినీ ఎరుగని సుఖ సౌఖ్యాలతో వర్ధిల్లు తుంది. మరోప్రక్క వివిధ దేశాలలో పర స్పరం విరోధాలు పెరిగి కృత్రిమమైన అడ్డులు, ఆటంకాలు ఏర్పరచుకోడంవల్ల సర కుల రవాణా లేక సంపర్కాలు లేక నశించి పోతాయి. ●

## అయితే వారు ఎవరి షూలు పాలిష్ చేస్తారు?

సివిల్ యుద్ధపు రోజులలో యుఎస్‌ఎకి విదేశీ రాజ్యాంగ మంత్రిని వైట్‌హౌస్‌కు ఆహ్వానించగా వెళ్ళినప్పుడు ప్రెసిడెంటు తన షూలకు పాలిష్ చేసుకుంటుంటే చూచి విభ్రాంతి చెంది తన దేశంలో ఎవరికి వారు షూలు పాలిష్ చేసుకోడం అలవాటు లేదన్నాడు. దానికి వెంటనే లింకన్ తన సహజ సరసంతో 'అయితే వాళ్ళు ఎవరి షూలు పాలిష్ చేస్తారు' అని అడిగారు.

"ప్రయత్నంవల్ల సంపద కలుగుతుంది,
ప్రయత్నం లేకున్న ఉన్న సంపద పోతుంది."

# అపూర్వ వివాహ సాంప్రదాయాలు

సీలీమా రీలీ

మధ్యధరా సముద్రం సైప్రస్ ద్వీప కల్పంలో వివాహం నిశ్చయించుకున్న వధూవరుల ఆరుబయట ప్రక్కమీదికి యువక ప్రియులు ధనాన్ని విసురుతూ ఉంటారు. వివాహం జరిగిన ఒక సంవత్సరం తరువాత ఆ సొమ్మును ప్రోగుచేసుకుంటారు.



చైనాలో వరుడు అసలురహస్యం వెల్లడి చేయకుండా ప్రతిరోజు వధువు ఇంటికి వెడు తుంటాడు. అపురూపమైన విలువైన కాను కలు అర్పిస్తుంటాడు. ఇలా అర్పించు తుంటూ చివరకు దరిద్రుడుగా తయారవుతూ అవకాశం వచ్చినప్పుడు రహస్యం చెప్పు తుంటాడు

బోర్నియోలో ఆడపిల్లలు పుట్టీ పుట్ట కుండానే పెళ్ళిళ్ళు నిశ్చయం చేయరు. పెరిగి పెద్ద అయ్యేదాకా నిరీక్షిస్తారు. ఆ తరువాత ఎవరైనా యువకుడు ఆ వధువుని చూసి ఇష్ట పడి ఆమెను కొనుక్కుంటాడు. ఆమెను కొనుక్కోవడంతోనే ఆమె అతనికి [illegible]ందం అవుతుంది. [illegible]

బర్మాలో ఒక యువకుడు ఒక యువతిని పెళ్ళి చేసుకోదలచినప్పుడు ఒక [illegible] పెదెలో పచ్చ చుట్టలు green cigar[illegible] పెట్టుకుని ఆమెను సందర్శిస్తారు. ఆ త[illegible] వాత పెళ్ళి పెళ్ళికూతురి ఇంట్లో జరు[illegible] తుంది.

న్యూ గునియాలో (New Guinea) కొన్ని జాతులలో పెళ్ళిపెత్తనం పెళ్ళికూతురి తలిదండ్రుల చేతులలో ఉంటుంది తలి దండ్రులే చొరవ తీసుకోవలసివస్తుంది. పురు షులు ఎప్పుడూ సిగ్గుతో ఉంటారు. అందుకే పెళ్ళికూతురి తలిదండ్రులు స్నేహితులతో, బంధువులతో సంబంధం కలుపుకోవాలి అను కున్న పురుషుని ఇంటిమీద పడతారు. ఇల్లంతా ముట్టడించి కోళ్ళని, పందుల్ని, ఇతర ఆస్తిని, ఉపయోగపడతాయని అను కున్న వస్తువులని సంగ్రహించుకుని చివరికి పెళ్ళికొడుకుని వెతికి పట్టుకుంటారు. పెద్ద ఉత్సాహంతో రెండు పార్టీలు సంతోషంగా కేకలు వేసుకుంటూ సంబరంలో పెళ్ళికొడు కుని ఎత్తుకుపోతారు.

జావాలో వధూవరులు అందంకోసం తమ దంతాలకు నల్లటిరంగు వేసుకుంటారు. పెళ్ళి సమయంలో పెళ్ళికూతురు పెళ్ళి కొడుకు కాళ్ళు కడిగి తన సేవా భావాన్ని ప్రకటింపుకుంటుంది.

"అసలే జీవిత ప్రమాణం తక్కువ. వృథా కాలయాపనలో దానిని మరింత తగ్గించుకుంటారు."

# వనితాలోకం

### కొబ్బరినూనెను శాస్త్రయుక్తంగా శుద్ధిచేసే ఉత్తమ విధానం

కొబ్బరినూనెను శాస్త్రయుక్తంగా ఉత్తమ విధానంలో శుద్ధిచేయాలంటే జామచెట్టు చిగుళ్ళు కొద్దిగా కొబ్బరి నూనెలో వేసి కాచండి. చల్లారిన తరువాత మాడిపోయిన చిగుళ్ళను తీసివేయండి. ఈ నూనె గడ్డకడితే ఇంట్లో కాచిన నెయ్యిలా ఉంటుంది.

* * *

### అరటి తొక్కలతో బూట్లకు పాలీష్

అరటి తొక్కలతో (లోతట్టు) బూట్లకు మంచి పాలిష్ వస్తుంది. అరటి తొక్కలతో పాలిష్‌చేసి తరువాత బట్టతో తుడవండి.

* * *

### చేదుమందులు మ్రింగాలంటే?

చేదుమందులు మ్రింగాలంటే ముందు చిన్న ఐస్‌ముక్క నోటిలో పెట్టుకుంటే ఐస్ తాత్కాలికంగా రుచిగ్రంధులను మొద్దుబారిస్తుంది. రుచి తెలియదు.

* * *

### మట్టిచేరిన దువ్వెనలను శుభ్రం చేయాలంటే?

మట్టిచేరిన దువ్వెనలను డిటర్జెంటు సబ్బు నీళ్ళుగానీ, లిక్విడ్‌సోపు నీళ్ళలోగానీ ఒక పళ్ళెంలో రాత్రి నానబెట్టండి పొద్దున్నే ఒక పాత టూత్‌బ్రెష్‌తో కడిగేస్తే నూనె జిడ్డు, మట్టి సులభంగా పోయి దువ్వెనలు కొత్తవిగా ఉంటాయి.

### డైనాసరస్ అంతరించడానికి ఆమ్లవర్షం కారణం




రొనాల్డ్ ప్రిన్ మరియు బ్రూస్‌పెగ్లే అనే భూగర్భశాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి ఆమ్ల వర్షంవల్ల డైనాసరస్‌లు అంతరించి పోయాయని అంటున్నారు.

అధికంగా మంచుకలిగిన దీర్ఘ కాలిక 12.5 మిలియను బిలియను కిలోగ్రాములు తూగే తోకచుక్కవల్ల ఆమ్లవర్షం ఏర్పడి ఉండాలని, ఇది భూమిమీదకు సెకండుకు 65 కి.మీ. వేగంతో చేరి ఉండాలని, ఆ ఒత్తిడివల్ల వాతావరణంలో ఉష్ణం జనించి అధిక ప్రమాణాలలో నైట్రొజన్ ఆక్సైడ్ లేచి ఉండాలని, 10 000 సంవత్సరాల దాకా అగ్ని పర్వతాలవల్ల ఆమ్లవర్షాలు ఏర్పడి ఉండాలని వీరు అంటున్నారు.

—'పిఐబి - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

"మహనీయుల జీవిత చరిత్రలే
మానవులకు ఉత్తమ గురువులు."

# సుఖంగా ఉండాలంటే?

ఎస్. వి. మొహె

సుఖంగా ఉండాలని మనస్సులో తీవ్రమైన కోరిక ఉంటే అందరూ సుఖంగానే ఉండవచ్చు. మానవుడు అనాది నుంచీ ప్రశాంతమైన సుఖమయ జీవితానికి రహస్యాన్ని తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నంలో కొందరు తెలుసుకోగలిగారు. కొందరు విఫలులైనారు. సుఖానికి మానవుని



అన్వేషణ నిరంతరం జరుగుతూనే ఉంది. ఇంతకీ అసలు సుఖం అంటే ఏమిటి? భౌతిక శరీరం, మనస్సు, ఆత్మ మూడు సమైక్యం పొంది సంతృప్తితో తనివితీరా ఆనందం అనుభవించడం సుఖం అని కొందరి అభిప్రాయం. జీవితంలో ఒడుదుడుకులు, కష్టాలు లేకుండా జీవితాంతం సుఖంతో ఆనందమయంగా ఉండాలని అందరం అనుకుంటాము. అయితే ఈ సుఖం అందరికీ ఒకే రకంగా ఉండదు. వ్యక్తిగతంగా వారి వారి మనోభావాలనుబట్టి ఇది మారుతూంటుంది. కొందరు తమ ధర్మాన్ని తాము పూర్తిగా నెరవేర్చినపుడు అపరిమిత సుఖాన్ని అనుభవిస్తారు. కొందరు తలపెట్టిన కార్యాలు నిర్విఘ్నంగా కొనసాగినప్పుడు ఆనందం అనుభవిస్తారు. పరీక్షలలో ఉత్తీర్ణులైతే కొందరికి పరమ సంతోషం. నిరుద్యోగులు తమనో పాధికి తగిన ఉద్యోగం దొరికినప్పుడు ఆనందంతో ఉప్పొంగిపోతారు. కొందరు వలచి వలపించుకుని ప్రేమసాగరంలో ఈదులాడుతూ సుఖం అనుభవిస్తారు. ఇంకా కొందరు ఆధ్యాత్మిక జీవనం గడిపే సాధు పుంగవుల సాన్నిధ్యంలో ఆనందం అనుభవిస్తారు. వారి వారి పరిధులలో ఎవరికి వారు అనుభవించే సుఖాలు, ఆనందాలు వేరు వేరుగా ఉంటాయి.

సాధారణంగా ధనం ఉంటే ఆనందభవనానికి కవాటాలు తెరుచుకుంటాయని కొందరి అభిప్రాయం. ఇది వాస్తవం కాదు. ఇదే నిజమైతే లోకంలో భాగ్యవంతులందరూ అనంతమైన సుఖాన్ని అనుభవిస్తూండాలి కదా! మానవుని సౌభాగ్యానికి, ఆనందానికి ధనం ఒక్కటే మూలం కాదు. సదా పిరి

## ముఖచిత్ర వాక్య

(నవంబరు 1988)

"భారత ఆధ్యాత్మిక జ్యోతి
పారమార్థిక దివ్యదీప్తి."
— సీల శ్రీనివాస్, మిరుదొడ్డి.

*  *  *

"దివ్యపురుషుల ఆశీస్సులు
దేశానికి శ్రీరామరక్ష."
— వి. శ్రీనివాసులు, కోర్నం.

"అర్హత మనోధైర్యాన్ని ఇస్తుంది. మనోధైర్యం ఉత్సాహాన్నిస్తుంది. ఉత్సాహం ప్రపంచాన్నే జయింప జేస్తుంది."

సంపదలతో తులతూగే సౌభాగ్యవంతుడు ఒకప్రక్క ఆవేదనపడిపోతూంటే, మరో ప్రక్క చెమట ఊడ్చి కాయకష్టాలకు ఓర్చి కూలిపనితో జీవించే శ్రామికుడు ఉల్లాసంగా ఆడుతూ పాడుతూ పని చేసుకుంటాడు. గొప్ప వ్యాపారస్థుడు తన వ్యాపారంలో సంభవించే లాభనష్టాలకు వాపోతుంటే రిక్షా వాలా గానీ, కూలీగానీ తన తన యోగానికి సరిపెట్టుకుంటూ వచ్చిన బాడుగతో, కూలీతో అపరిమితమైన ఆనందాన్ని అనుభవిస్తారు.

కష్టమో సుఖమో అంతా మన చేతుల్లోనే ఉంది. సుఖం అనేది ప్రతి వ్యక్తి హృదయంలోను ఉంటుంది. వేరే పైన ఎక్కడా ఉండదు. ఒకరు ఇంకొకరిని సంతోష పెట్టలేరు. ఎవరి ఆనందం వారు పెంచుకోవాలి. ఎవరి సుఖం వారు ప్రవృద్ధి చేసుకోవాలి.

ఎప్పటికప్పుడే మనని మభ్యపెడుతూ చేతికి దొరకకుండా జారిపోతూన్న సుఖాన్ని పొందడం ఎలా? ఋజువైన ఉపాయాలు కొన్ని ఉన్నాయి. కలసి హాయిగా జీవించేందుకు తోడ్పడే గుణాలను అన్వేషించడం మాని, ఇతరుల లోపాలను గమనించే ప్రవృత్తి మానవుల మధ్య పరస్పర సంబంధంలో చిక్కులకు కారణం అవుతుంది.

మనలో మనకు విశ్వాసం ఉండాలి. మన సామర్థ్యంలో మనకు నమ్మకం ఉండాలి. ఉన్నదాంతో పూర్తిగా సంతృప్తి చెంది ఉండాలి. జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు, జయాపజయాలు, విపరీత సంఘటనలు ఏర్పడతాయి. వీటిని స్వీకరించే విధానంలో సుఖం అంతర్భూతమై ఉంటుంది విద్యుక్త ధర్మాన్ని సక్రమంగా నెరవేర్చడంలో ఎంతో సుఖం ఉంది. సన్మార్గంలో జీవించడంలో ఆనందం, ప్రేమానురాగాలతో చేసిన సేవా ఫలితం అనుభవించడంలో ఆనందం ఉంది. తృప్తి చెందడంలో ఆనందం ఉంది. సౌశీల్యంతో సుఖం సృష్టించుకోవచ్చు. త్యాగబుద్ధే సౌఖ్యానికి కీలకం. సేవాసౌభాగ్య ఫలితంగా పొందదగిన సుఖంకంటే వేరే సుఖం

## గుడ్లగూబ దృష్టి అతి సున్నితమైనది

గుడ్లగూబ దృష్టి మానవుని దృష్టికంటే 100 రెట్లు అధికంగా సున్నితంగా ఉంటుంది. రాత్రి చీకటిలో 1312 అడుగుల దూరంగా వెలుగుతూన్న క్రొవ్వొత్తిని కూడా చూడగలదు. కానీ మానవుని దృష్టి ఇంత దూరంలో దేనినీ చూడలేదు.

''కాకులతో చేరిన తెల్లపావురాల ఈకలు తెలుపే,
కాని హృదయాలు మాత్రం నల్లగా ఉంటాయి.''



ఇంకో విధంగా పొందలేము. ఇతరులను సంతోషింపజేయగలిగినప్పుడే నీకు సంతోషం ఏర్పడుతుంది. ఉత్సాహంలో ఆనందం ఉంది సృజనాత్మకమైన జీవితం సుఖమయ జీవితం. భగవంతునితో సాయుజ్యం చెందగలిగినప్పుడు సుఖం అనుభవిస్తావు. సుఖసంతోషాలు ఇతరులతో సరిసమానంగా పంచుకుంటే అవి సంపూర్ణమవుతాయి. సత్క్రియలు చేయడమే సంతోషవంతమైన పని. సుఖంగా ఉండాలంటే నిన్ను నీవు మరచిపోవాలి. పరోపకార బుద్ధి అలవరచుకుంటే సుఖం దానంతటదే ఏర్పడుతుంది. ఆటలు ఆడుతూ, పాటలు పాడుతూ సుఖంగా ఉండు. పని చేయవలసిన సమయంలో పనిచేసి సుఖంగా ఉండు. ఆశాపూరితమైన ఆలోచనలే చేస్తూ మన అంతశ్చేతనలోకి కూడా వాటిని ప్రసరించేటట్లు చేసుకుంటే జీవితాంతం మనం ఆనందరేఖలు దిద్దుకోవచ్చు. సుఖానికి రహస్యం పిలోనే ఉంది.

దుఃఖానికి అనేక కారణాలు ఉన్నాయి. ఉన్నదాంతో సంతృప్తిపడకుండా లేని దాని కోసం ఆశించడం, భయం, కోపం, అసూయ, పగ, వంచన, దురాశ, జిత్తులమారితనం, కపటోపాయం, అందోళన, ఆరాటాలు, స్వార్థపరత్వము, దురహంకారం, సోమరితనం, వృథాకాలక్షేపం, విసుగు, దారిద్ర్యం, అనారోగ్యం, అవజయం. భీతి, భ్రాంతి, ఒకరి సుఖంకోసం మరొకరిని మోసంచేయడం మొదలైనవన్నీ కష్టానికి మూలకారణాలే.

ఉన్నదాంతో సంతోషపడడం చేతకాని వారు ఇంకా ఎక్కువ సంపాదిస్తే మాత్రం ఎలా సంతోషపడగలరు? సుఖశాంతులు పెంచుకోవాలంటే దురాశలు పెంచుకో కూడదు. శరీరం ఆరోగ్యంగా ఉంటే మనస్సు నిర్మలంగా ఉంటుంది ఋజుమార్గంలో న్యాయబద్ధంగా నిష్కల్మషమైన జీవితంతో నిర్మాణాత్మకంగా జీవిస్తూ ఇతరులకు ఉపయోగకరంగా పరోపకారబుద్ధితో జీవించడంలో ఆనందం ఉంది. ఇంకో విధంగా సుఖం పొందాలంటే ప్రపంచంలో మరో మార్గంలేదు.

## వజ్రాల వ్యాపారంవల్ల భారతదేశానికి విదేశీమారకం

1985-86 లో వజ్రాల ఎగుమతి విలువ రూ. 1,344 కోట్లు. భారతదేశానికి ఈ వ్యాపారం అత్యధిక విదేశీ మారకాన్ని సంపాదిస్తుంది. ఈ పరిశ్రమలు 3,50,000 మందికి (నిపుణులకు, ఇతర పనివారలకు) జీవనోపాధిని కల్పిస్తుంది.

''కుటిల మనస్కులు తమ తప్పులను తమ నుంచి
ఇతరుల నుంచీ దాస్తారు. సజ్జనులు మాత్రమే

# సూపర్ నోవా 1987A

జిమ్‌ఫుల్లర్

భూమికి మిక్కిలి దూరంగా విస్ఫోటనం చెందుతున్న నక్షత్రం (Exploding Star) ఎక్కువ ప్రకాశవంతమైనది. సుమారు 400 కాంతి సంవత్సరాల దూరంలో ప్రకాశిస్తూన్న ఈ సూపర్‌నోవాను ఖగోళ శాస్త్రజ్ఞులు పరిశోధించడానికి అనుకూలపడింది. క్రొత్త క్రొత్త నక్షత్రాలను, గ్రహ




కుటుంబాలను పరిశోధించగలుగుతారు మొట్టమొదట 1987 లో భూమినుండి సూపర్ నోవా కనుగొనబడింది.

ఆకాశంలో పాలసముద్రానికి దగ్గరగా ఒక చిన్న నక్షత్రవీధిలో లార్జ్ మెగాలానిక్ క్లౌడ్‌లో నీలిరంగుతో ప్రకాశించే సాండులీక్ (Sanduleak) అనే పెద్ద నక్షత్రం 1,55,000 సంవత్సరాలకు పూర్వం విస్ఫోటనం చెంది 'సూపర్‌నోవా 1987 A' ఏర్పడింది.

దూరదర్శిని సాధనం కనిపెట్టడానికి మూడు సంవత్సరాలకు ముందు 1604 లో జర్మన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు జొహాన్ కెప్లెర్ కనిపెట్టిన నక్షత్ర విస్ఫోటనం తరువాత కాంతివంతమైన సూపర్‌నోవా విస్ఫోటనం రికార్డు చేయబడింది.

'సాండులీక్' మొట్టమొదట సూర్యుని పరిమాణానికి 20 రెట్లుందని, దీని మధ్య భాగంలో హీలియం మరియు ఇతర హెవీ మెటల్స్ ఉదజనితో ఆవరింపబడి ఉన్నాయని శాస్త్రజ్ఞులు వివరించారు మధ్యభాగంలో ఉన్న హీలియం కోర్ పీడనంవల్ల సూపర్ నోవా విస్ఫోటనం ఏర్పడింది. మిగిలిన నక్షత్ర భాగం ఆకాశంలోకి జరిగింది.

విస్ఫోటనం చెందిన నక్షత్ర మధ్యభాగం ఇంకా సూపర్‌నోవా మధ్యలోనే గిరగిరా తిరుగుతున్న న్యూట్రాన్ నక్షత్రంలా ఉందని, ఇందులో విస్ఫోటన వల్ల, గురుత్వ శక్తివల్ల ఏర్పడిన ద్రవ్యం మిక్కిలి సాంద్రమైనదని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

సూపర్‌నోవా అతి శీఘ్రంగా బ్రహ్మాండంగా తిరుగుతూన్న న్యూట్రాన్ నక్షత్రం నుండి గామా కిరణాలు ప్రసరింపచేస్తుందని, ఇవి ఇంతవరకు ఉత్పత్తి కాబడినవాటి అన్నిటికంటే మిక్కిలి శక్తివంతంగా ఉంటాయని శాస్త్రజ్ఞులు సూచిస్తున్నారు

—'యునైటెడ్ స్టేట్స్ ఇన్‌ఫర్మేషన్ సర్వీస్' సౌజన్యంతో

"నామరూపాలు ఎట్టివైనా నాసరే సమస్త పూజలు శివుడికే చెందుతాయి."

# తేనెతో పానీయాలు

తేనెటి (హనీటి)· ప్రొద్దున్నే కాఫీ, టీలకు బదులు ఒక కప్పు వేడినీళ్ళలో ఒక పెద్ద చెంచాడు తేనె కలిపి మెల్లి మెల్లిగా చప్పరించి త్రాగితే ఎంతో ఆరోగ్యకరం. పరగడుపున త్రాగడం చాలామంచిది అజీర్ణ బాధలకు దివ్యమైన మందుగా పనిచేస్తుంది. రోజుకు రెండు మూడుసార్లు త్రాగవచ్చు



తేనె నిమ్మరసం· ఒక కప్పు వేడి నీటిలో అరనిమ్మకాయ రసం, ఒక పెద్ద చెంచాడు తేనె బాగా కలిపి త్రాగితే లివరు సంబంధమైన రోగాలు ఇట్టే కుదిరిపోతాయి. శరీరానికి మంచి తేజస్సు, కాంతి వస్తుంది. శరీరంమీద మచ్చలు పోతాయి. పడుకునే ముందు వేడిగా త్రాగితే జలుబు రొంప తగ్గిపోతుంది.

తేనె పాలు: ఒక కప్పు వెచ్చనిపాలలో ఒక చిన్న చెంచాడు తేనె పిల్లలకు మంచి ఆరోగ్యాన్ని. పుష్టిని కలిగిస్తుంది. పసిబిడ్డలకు కూడా ఇవ్వవచ్చు కడుపులో పుళ్ళకు, రక్త హీనతకు ఔషధంగా వాడతారు. రాత్రి పడుకునేటప్పుడు తీసుకుంటే మంచి నిద్ర పడుతుంది.

తేనె గ్లిసరిన్: ఒక కప్పు వేడినీటిలో రెండు చిన్న చెంచాల తేనె, ఒక చిన్న చెంచాగ్లిసరిన్ కలిపి గొంతుపుండు నివారణకు, జలుబుల నివారణకు వాడవచ్చు.

## మీరైతే....?

(నవంబరు 1988)

('సొమ్ము ఒకరిది సోకు ఒకరిది' అంటె?)

"అందుకే 'అత్తసొమ్ము అల్లుడు దానం చేస్తున్నాడు' అంటారు."

— డి. లక్ష్మణచారి, హైద్రాబాద్

(13 వ పేజీ తరువాయి)

చివరగా తగినంత నిద్ర ఆవశ్యకం మానసిక విశ్రాంతి చాలా ముఖ్యమైనది. విశ్రాంతివల్ల, నరాల బిగి సడలించుకోడం వల్ల వృద్ధాప్యం కొంచెం మెల్లిగా వస్తుంది. చిరాకులతో టెన్షన్ పెంచుకుంటే ముందుగానే ముసలితనం వస్తుంది. లౌకిక దృష్టిని మళ్ళించుకుని జీవితంలో ఆధ్యాత్మిక దృష్టిని అలవరచుకోవాలి ఆధ్యాత్మిక జీవనం కంటే కూడా చురుకుగా పనిచేసే రోజులతో పాటే జీవితం కూడా అయిపోతూందనే భావన ముఖ్యం. శాదూరి

"స్వార్థరహిత సేవచేసి భగవంతుని జయించవచ్చు."

# జ్ఞానసిద్ధికి సులభమార్గం

కోసూరి శీలామాధవ్

లోకం తీరు చాలా విచిత్రంగా ఉంటుంది. ధర్మం, అధర్మం మన బుద్ధికి సులభంగా అందవు. అందుకే తికమకలు పడిపోతూం టాము ఏదో మంచి ఉందనుకుంటాం. దాని మరుగునే కొంత చెడు నక్కి ఉంటుంది. మనస్సు ఒక నిమిషం కూడా ఒకదాని మీద స్థిరంగా నిలవదు. మనస్సుకు నిలకడలేదు.



ప్రతీ నిమిషం అటూ, ఇటూ పరుగెత్తుతూం టుంది. మనం ధర్మం అనుకునేది ఉన్న ట్టుండి అధర్మంగా మారిపోతూంటుంది. న్యాయబద్ధంగా ప్రవర్తిస్తున్నామని అను కుంటూ అధర్మ ప్రవర్తకులము అయిపో తాము. దయ ఎంతో మంచి గుణమే, నిజమే. సందర్భాన్ని బట్టి అది దోషంగా మారిపోయే ప్రమాదం కూడా ఉంది. స్వధర్మాన్ని తెలుసుకోవాలి. ఎవరి స్వధర్మా నికి వారు కట్టుబడి ప్రగతిని పొందాలి. స్వధర్మం వదలి మంచితనం అని చెప్పు కుంటూ ఇష్టం వచ్చినట్టు ఉండడం అపాయం.

ప్రతిరోజూ మనకు అసలు తెలియ కుండానే ఎన్నెన్నో పాపాలు జరిగిపో తూంటాయి. పైకి మంచిగా కనిపించినా కాన్సర్ రోగంలాగా ఆ మంచి ముసుగులో పాపం పెరుగు పోతూంటుంది. మన బుద్ధికి యోచనచేసే శక్తి ఉంది. మనకి విచక్షణా బుద్ధి ఉంది. ఏది మంచిది? ఏది చెడ్డది? ఏది ధర్మం? ఏది అధర్మం? అనేది తెలుసుకో గలము అయినా "నేను" "నాది" అనే భావాలు అహంకారం, అభిమానం మబ్బు కప్పినట్టు మనస్సును కప్పేస్తాయి. రంగు అద్దంలో చూస్తూన్నట్టు మనకి ఎప్పుడూ చెడు మంచిగానే కనిపిస్తూంది. ఈ భ్రమతో అహంభావం పెరిగిపోతూంటుంది. అహం భావం పెరగడంవల్ల మనకి మన దోషాలు కనిపించవు.

మానవులు క్రోధం, లోభం, మోహం అనే దోషాలకు లొంగిపోయి ఉంటారు. ఈ

## పాఠకుల అభిప్రాయాలు

"విజ్ఞానాన్ని విశ్వశాంతికి వినియోగించు,
అహంకారంతో అశాంతికి పాల్పడకు."
— డి.జి. శంకరశ్రీనివాస్,
గంగచోళ్ళపెంట.

* * *

"వయస్సు ముదిరితే వృద్ధులు,
బుద్ధి పెరిగితే పెద్దలు."
— వాసా రామలింగేశ్వరరావు,
రామచంద్రపురం.

"పతకం గెలవడం కాదు, పాల్గొనడం ప్రధానం.
సాధించడం కాదు, పోరాటమే ముఖ్యం."

త్రిదోష స్వభావంతోనే ప్రపంచాన్ని పరిశీలిస్తారు. కాబట్టి ఎదుటివారి అభిప్రాయాలకి వాస్తవమైన విలువ ఉండదు.

మానవాతీతులైన మహాత్ముల దృష్టి నిర్దోషంగా ఉంటుంది. ఇటువంటి మహాత్ములను అనుసరిస్తే జీవితం నిరామయంగా ఉంటుంది. కానీ ఇటువంటి మహాత్ములు సులభంగా కనిపించరు.

భగవంతుడు గుణరహితుడు. దయామయుడు. పసిబిడ్డ తల్లికోసం ఏడుస్తున్నట్లు మనం భగవంతునికోసం విలపిస్తే చేతులు జాచుకుని ఆయన మనల్ని ఆదరిస్తాడు.

ఇటువంటి భగవంతుని పొందాలనే తపన మనలో బయలుదేరాలి. ఇతర వ్యామోహాలు లేకుండా కేవలం ఆ పరబ్రహ్మను పొందాలనే కాంక్షను ప్రబలం చేసుకోవాలి. ప్రప్రథమంగా విశ్వాసం లేకుండా ఏ పనిని సాధించలేము. పూర్తి విశ్వాసంతో కాంక్షను పెంచుకోవాలి. ఆ భగవంతుడే సర్వసమర్థుడు. ఆ భగవంతుడే ఆనంద స్వరూపుడు అనే విశ్వాసం ఏర్పరచుకోవాలి. ఇటువంటి విశ్వాసం ఏర్పడితే కాంక్ష దానంతటదే ఏర్పడుతుంది. కానీ "కావాలని" కోరుకునే కాంక్ష కూడా దోషమే. సాత్త్విక, రాజసిక, తామసిక గుణాలు సదా మనమీద ప్రభావితం అవుతూంటాయి. సాత్త్విక గుణంతో కూడిన కాంక్షను పెంచుకోవాలి. లౌకిక సుఖాలను అనుభవించడానికికాదు పరమాత్మ. పరమాత్మకోసమే పరమాత్మ కావాలి అని ప్రయత్నిస్తే జీవితం ఆనందమయంగా ఉంటుంది. ఇదే సుఖమయ జీవితానికి సులభ మార్గం. చిత్తశుద్ధితో జ్ఞానసిద్ధిని కలిగించుకోవాలి. జ్ఞానాన్ని కర్మదృష్టితోను, కర్మను జ్ఞానదృష్టితోను చూడాలి.

## భారతదేశంలో 50 మిలియను ఆదిమవాసులు



ప్రపంచం అంతటా చెదిరిపోయి ఉన్న 300 మిలియను ఆదిమవాసులలో చాలా మంది ఆసియాలో ఉన్నారు. భారతదేశంలో 50 మిలియను ఆదిమవాసులు ఉన్నారు. భారతదేశపు భిల్లులు, శాంతాలులు, బంగ్లాదేశ్‌లో చక్మాలు, లూషాయిలు, ఇండోనేషియాలో డాయకులు, సాసకులు, థాయ్‌లాండ్‌లో మోనులు, కార్నేలు వంటి ఆదిమవాసులు అందరు అభివృద్ధి ప్రభావంలో అంతరించిపోతారు వారి వారి సాంప్రదాయక జీవిత విధానాలు నిలబడవు.

—'ఇంటర్ నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ రిపోర్టు' సౌజన్యంతో

"ప్రపంచంలో ఇతర గ్రంథాల కంటే జీవిత
చరిత్రలు చదువుకోడానికి మిక్కిలి

# నిజాలు - నిదర్శనాలు

## ప్రపంచ మార్కెట్‌లో భారతదేశపు వాటా

భారతదేశానికి వినియోగపడకుండా ఉండిపోయిన మార్కెట్ ఆర్థిక విలువ అధికంగా ఉంది. 160 బిలియన్ డాలర్ల (1,60,000 మిలియన్ డాలర్లు) ప్రపంచ వ్యాపార విలువలో భారతదేశపు 11 బిలియన్ డాలర్ల (11,000 మిలియను డాలర్లు) వ్యాపారం మహాసముద్రంలో ఒక బిందువు.

* * *

## ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కు రూ. 80.05 కోట్లు లాభం

1987-88 లో ఎయిర్ ఇండియా రూ. 80.16 కోట్లు లాభం గణిస్తే, ఇండియన్ ఎయిర్‌లైన్స్ వారు రూ. 80.05 కోట్ల లాభం సంపాదించారు.

* * *

## 1166 బ్లాకులలో "ఆపరేషన్ బ్లాక్‌బోర్డు" విధానం అమలు పర్చబడింది:

1987-88 కాలంలో "ఆపరేషన్ బ్లాక్ బోర్డు" విధానం (ప్రాథమిక పాఠశాలలలో కనీసావసరాలను కలిగించడం) 258 మునిసిపల్ ప్రదేశాలలోని 1166బ్లాకులలో మొత్తం 34,157 ఉపాధ్యాయులు గల 1,01,861 పాఠశాలలలో అమలుపర్చబడింది. పాఠశాల భవనాల నిర్మాణానికి సుమారు రూ. 238 కోట్లు ఇతర సాధన సదుపాయాలకు రూ. 72 కోట్లు రాష్ట్రప్రభుత్వాలు వెచ్చించాయి.

* * *

## వివిధ దేశీయ పుష్పాలు



భారతదేశము — కమలము
ఆస్ట్రేలియా — గోల్డెన్‌వాటిల్
కెనడా — మాపిల్ లీఫ్
డెన్మార్క్ — ఫర్‌గెట్-మి-నాట్
ఈజిప్టు — కమలము
బ్రిటన్ — గులాబి
ఫ్రాన్స్ — ఫ్లూయెర్-డి-లిస్
ప. జర్మనీ — కార్న్‌ఫ్లవర్
ఇటలీ — లిల్లీ
జపాన్ — ఈడెల్‌వీస్
యుఎస్ఎ — గోల్డెన్‌రాడ్
చైనా — నార్‌సిస్సస్

"జబ్బు పడేదాకా తినేవాడు జబ్బు కుదిరేదాకా లంఖణం చేయాలి."

—థామస్ ఫుల్లర్

## జపానులో 1000 మిలియను పుస్తకాలు, పత్రికలు కొంటారు

1981వ సం. నుండి జపానీయులు ప్రతి సంవత్సరం 1000 మిలియన్ పుస్తకాలు, పత్రికలు కొంటున్నారు. 121 మిలియను మంది జపానీయులలో సుమారు 99 శాతం మందికి వ్రాయడం, చదవడం తెలుసు. 1987 లో జపానువారు 4,010 మిలియను పత్రికలను, 1,450 మిలియను పుస్తకాలను అమ్మివేశారు.

* * *

## భారతదేశపు తీరరేఖ 6080 కి.మీ.లు

భారతదేశానికి 6080 కి. మీ. తీరరేఖ ఉంది. ఈ తీరరేఖ పొడవునా అనేక ఓడ రేవులతో పాటు 10 పెద్ద మరియు 185 చిన్న రకపు నౌకాశ్రయాలు ఉన్నాయి. సముద్రంలో ప్రయాణించేసే వ్యాపార నౌకలు 300 ఉన్నాయి. భారతదేశపు విదేశీ వ్యాపారం విలువ సుమారు రూ. 20,000 కోట్లు. —'యోజన' సౌజన్యంతో

* * *

## ఒరిస్సా 4,00,000 క్వింటాళ్ల 'కెండూ' ఆకును ఉత్పాదిస్తుంది:

ఒక సంవత్సరంలో ఒరిస్సా రాష్ట్రంలో వివిధ అటవీ ప్రాంతాలలో సంవత్సరానికి 4,00,000 క్వింటాళ్ళ బీడీ చుట్టే 'కెండూ' ఆకు ఉత్పత్తి చేయబడుతూంది. ఇది దేశంలో మొత్తం ఉత్పాదనలో 10 శాతం.
—'సైన్సు రిపోర్టరు' సౌజన్యంతో

* * *

## భారతదేశంలో గాస్ మరియు నూనె వనరులు:

భారతదేశంలో నూనె మరియు గాస్ వనరులు వరుసగా 3,495 మిలియను టన్నులు మరియు 1,154 మిలియను టన్నులు అని అంచనా వేయబడింది. 1987-88 లో ముడినూనె మరియు గాస్ సరఫరాలు వరుసగా 30 36 మిలియను టన్నులు మరియు 6,620 మిలియను ఘనమీటర్లు.

## మిక్కిలి పెద్ద డైనాసర్ గుడ్లు


DINOSAUR EGGS

ఫ్రాన్సులో కనుగొన్న మిక్కిలి పెద్ద డైన డైనాసర్ గ్రుడ్డు 3 3 లీటర్ల పరిమాణం కలిగిఉంటుంది. వీటిని 8,00,00,000 సంవత్సరాలకు పూర్వం నివసించిన 9.19 మీటర్ల సౌరోపాడ్ (Sauropod) పెట్టింది.

"లోకములో భయములేని వస్తువే లేదు.
భయములేనిది ఒక్క వైరాగ్యమే."

# జీవితాన్ని సద్వినియోగం చేసుకో

ఎప్పుడూ న్యాయబుద్ధితో ప్రవర్తించు.
వాదించేటప్పుడు ఉపాయంతో వాదించు.
ప్రతిరోజూ స్నానం తప్పక చేయి.
సక్రమ విధానంలో ఊపిరితీసుకో.
గంభీరంగా ఆలోచించు.
త్రాగేటప్పుడు సావకాశంగా త్రాగు.
ఏ ప్రయత్నమైనా నిష్కపటంగా
ప్రయత్నించు.



తప్పక ప్రతిరోజూ వ్యాయామం చేయి.
ఉదార బుద్ధితో దానం చేయి.
తెలివిగా వివేకంతో పెట్టుబడిపెట్టు.
కువిమర్శలు వద్దు.
త్యాగభావంతో విమర్శించు.
సౌమ్యంగా చూడు.
ధైర్యంగా ముందడుగు పెట్టు.
దీర్ఘంగా ఆలోచించు.
సూక్ష్మంగా పరిశీలించు.
యుక్తిగా యోజనలను ఏర్పరచుకో.
భక్తితో పూజించు.
మంచి యోగ్యతతో అర్హతను పొందు.
త్వరగా అనుభవసిద్ధం చేసుకో.

అతి జాగ్రత్తగా సాహసించు.
ఉత్సాహంతో సంగీతం పాడుకో.
నవ్వేటప్పుడు కపటం లేకుండా నవ్వు.
పట్టుదల వదలకుండా ఉండు.
తక్కువగా మాట్లాడు.
విశ్వాసపూరితంగా నమ్ము.
సక్రమంగా నడుచుకో.
గొప్పలకు పోకు.
సామాన్యమైన బట్టలు ధరించు.
ధ్యానసాధన అవలంబించు.

## సుభాషితాలు

తాననెడి యహంకారము
మానక తను దానె చెరుచు మైమరపించున్
నేనని పలికెడి వారికి
మానునె దుష్కర్మ ఫలము మహిలో
వేమా!

['నేను' అను అహంభావాన్ని విడిస్తే దుష్కర్మ ఫలాలు కలుగవు. అహంకారమే పతనమునకు మూలకారణము.]

* * *

ఫలము లేని కార్యములు సేయనొల్లరు
కల జనంబులెల్ల నిల నిజంబు
ఫలము మంచిదైన బరమందుమదమందు
విశ్వదాభిరామ వినుర వేమా!

[ప్రయోజనం లేని పనులు ఎవ్వరూ చేయరు. ఆ ఫలము మంచిదైతే ఇహంలోను పరంలోను సుఖం కలుగుతుంది.]

"ఆలోచనలో స్పష్టత, వాక్కులో నిర్మలత,
చేతలలో సహృదయత ఇవి ఆధ్యాత్మిక చిహ్నాలు."

మితంగా ఆహారం తిను.
ఓపికతో ధైర్యంగా ఉండు.
వారానికొకసారి ఉపవాసం ఉండు.
భక్తి శ్రద్ధలతో ఆలించు.
సొగసుగా పరిహాసం చేయి.
ఒకరు చెప్పేది సావధానంగా విను.
ఇతరులను అనురాగంతో ప్రేమించు.
సౌశీల్యం ముఖ్యం, పవిత్రంగా జీవించు.
మారుపలకకుండా పెద్దలమాట విను.
నియమానుసారంగా చెల్లించవలసినది చెల్లించు.
ఆటల సమయంలో ఆటలు ఆడు.
అతి జాగ్రత్తగా మాట ఇచ్చి, మాట నిలబెట్టుకో.
చదివేటప్పుడు మంచి గ్రంథాలు ఎన్నుకుని చదువు.
విశ్రాంతి అవసరం, దొరికినప్పుడల్లా విశ్రాంతి తీసుకో.
సేవ చేయవలసినప్పుడు మనసారా సేవ చేయి.
మితంగా నియమిత కాలంలో నిద్రపో.
మృదుమధురంగా మాటలాడు.
చదివేటప్పుడు శ్రద్ధగా చదువు.
ఆలోచించేటప్పుడు విమర్శనాత్మకంగా యోచించు.
చేయవలసినప్పుడు అవసరమైనప్పుడే ప్రయాణం చేయి.
తొందరపడకు, ఓపికపట్టి కాచుకునిఉండు.
ఒంగిపోకు, దర్జాగా రీవిగా నిలువుగా నడు.
ముత్యాల కోవలలాగా మంచి దస్తూరీ వ్రాయి.
చేసేపని సామర్థ్యవంతంగా చేయి.

—'ఐడియాస్ ఎక్స్చేంజి' సౌజన్యంతో

## జీవిత లక్ష్యము



భద్రతతో, పదిలంగా, సహనంతో ఉండటం జీవిత లక్ష్యంకాదు. పరాక్రమంతో ఉత్సాహవంతంగా ఉండటమే జీవిత లక్ష్యం. విశ్వాంతరాళంలో బ్రహ్మాండమైన దివ్యశక్తి వ్యక్తిగత జీవితాలను తీర్చి దిద్దుతుంది. వేదికలమీద ఆత్మనిగ్రహం గురించి ఎంతో చెప్పుకుంటాం. కానీ వాస్తవమైన ప్రత్యక్ష జీవితంలో దీనిని అనుసరించము. మృత్యుసమక్షంలో విషాన్ని ఆరగించిన సోక్రటీస్ ఆత్మ మనకు ధైర్యోత్సాహాలను కలిగిస్తుంది. శిలువ వేయబడ్డ క్రీస్తు జీవితం మన హృదయాలను ద్రవింపజేస్తుంది. హైందవ యోగపురుషుల జీవితాలను మర్యాదతో గౌరవిస్తాం. ప్రాణాలకైనా తెగించుకోగల ఆత్మశక్తిని అభివృద్ధి చేసుకోము. జీవితంలో ఎన్నో ఆటంకాలు, అపజయాలు మొదలైనవి భౌతికంగా ఏర్పడవచ్చు. మానసికమైన ఆత్మ పరాజయం మాత్రం పొందకూడదు.

—డా. ఎస్. రాధాకృష్ణ

"మానవుని కోరికలు తీరేవి కావు,
తీరిన కోరికలు సత్ఫలితాల నిచ్చేవికావు."

# "జూడో" అంటే ఏమిటి?

"జూడో" (Judo) అనే మాటకు సాధుత్వము (The way of softness) అని అర్థం. ఆయుధాలు ఉపయోగించకుండా చేసే ఒక రకం పోరాటం. అతి చురుకుగా నిర్ణయం తీసుకోవాలి. బలప్రయోగం ఉండదు ఇది ఒక క్రీడగా 1882లో జపాన్



దేశస్థుడైన ప్రొ. జిగోరో కానో (1860-1938) అభివృద్ధి చేసారు.

జపాన్ దేశపు సాంప్రదాయక యుద్ధకళ జుజుట్సు Jujutsu) లో నుంచి క్రొత్త క్రొత్త సాంకేతిక విధానాలు, సిద్ధాంతాలు ఉపయోగించాడు. ఒక్క ఆత్మ సంరక్షణకే గాక శారీరక, మానసిక శిక్షణకు ప్రత్యేకంగా దీనిని అభివృద్ధిపరచాడు.

నేడు ఈ జూడో క్రీడ ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి పొందింది. 1952 లో టోకియోలో స్థాపించబడిన అంతర్జాతీయ జూడో ఫెడరేషన్‌లో ప్రపంచంలో 107 వివిధ దేశాలు సభ్యులుగా చేరారు.

ముఖ్యంగా జూడో క్రీడలో శారీరక, మానసిక శక్తులు మిక్కిలి సామర్థ్యవంతంగా వినియోగింపబడతాయి. జూడో అభ్యాసం వల్ల ఆత్మరక్షణ ఏర్పడి శీలాభివృద్ధి కలుగుతుంది.

ఇది ప్రతిరోజు యోగాభ్యాసంలా నిత్య జీవితంలో అభ్యసించాలని ప్రొ. కానో అభిప్రాయం.

—'జపాన్ బులెటిన్' సౌజన్యంతో

## క్రొత్త శ్రవణ సాధనం

శబ్దతరంగాలు బాహ్య కర్ణేంద్రియం నుంచి చెవిలోపలికి సరిగా ప్రవేశించనప్పుడు చెముడు ఏర్పడుతుంది. ఇది సాధారణంగా చెవిలో ఎముకకు హాని సంభవించినప్పుడు గానీ, చెవిలోపల ఏ దైనా అంటురోగం సోకినప్పుడు గానీ ఏర్పడుతుంది. యుఎస్ఎ ఫ్లోరిడాలోని జాక్‌సన్ విల్లీలో క్సోమెడ్ ఇన్ కార్పొరేషన్ ఒక నూతన శ్రవణ సాధనాన్ని కనిపెట్టారు. ఇది చెవి ప్రక్కన ఎముకలో దూర్చిన ఒక చిన్న పళ్ళానికి అయస్కాంత శక్తితో అంటి ఉంటుంది. సూక్ష్మాతి సూక్ష్మమైన బాహ్యపు సౌండ్ ప్రోసెస్సర్, చిన్న మైక్రోఫోను కంపనలను పళ్ళానికి అందిస్తాయి. ఇది ఈ కంపనలను సరాసరి ఎముక దగ్గరకు తీసుకువెడితే అక్కడ ఇవిలోపలి నరాలు వినబడేటట్లు చేస్తాయి. నరాలు పనిచేయడంవల్ల ఏర్పడే చెవిటివారికి మాత్రం ఇది పని చేయదు.

—'యునైటెడ్ స్టేట్స్ ఇన్‌ఫర్మేషన్ సర్వీస్' సౌజన్యంతో

"మూర్ఖులకి వివేకం బోధించడం వృథా శ్రమ.
బొగ్గుని ఎంత కడిగినా తెల్లబడదు."

# బహుమతి పొందిన వ్యాసం

## ప్రకృతి ఉపద్రవాలు - నివారక చర్యలు

కోగంటి సాంబశివరావు, తెనాలి.

ప్రశాంతంగా సుందరంగా ఉన్న ప్రకృతి ఒక్కసారిగా విలయతాండవం చేస్తుంది. ఈ గంభీరత వెనుక ఇంతటి మహాశక్తి ఉందా అనిపిస్తుంది. మానవునికి భగవంతుడు ప్రసాదించిన వరం ఈ ప్రకృతి. దీనివల్ల లాభనష్టాలను రెంటినీ అనుభవిస్తున్నాడు మానవుడు.

వాస్తవానికి ప్రకృతి ఉపద్రవాలను మానవుడే కొని తెచ్చుకుంటున్నాడు విపరీతమైన జనాభావల్ల, ఇతర కారణాలవల్ల భూమిపై ఒత్తిడి పెరగడం, అడవులను, జంతువులను నాశనంచేసి ప్రకృతి సమతుల్యతకు భంగం కలిగించడం వంటివి ప్రకృతి ఉపద్రవాలకు దారితీస్తున్నాయి. అయితే వీటివల్ల కలిగే ప్రాణ, ఆస్తి కష్టనష్టాలను కాపాడుకోవడం మన కర్తవ్యం.

మానవుడు శాస్త్రీయంగా ఎంత ఎదిగినా ప్రకృతి చేతిలో కీలుబొమ్మే. ప్రకృతి విలయతాండవాన్ని ఎవరు ఆపగలరు? విజ్ఞానపు ఉన్నత ప్రమాణాలతో వీటివలన కలిగే నష్టాన్ని నివారించడం కొంతవరకూ సాధ్యమే. భూకంపాలను గురించి ముందే ఆలోచించి ప్రజలకు వివిధ వివరాలను తెలియజెప్పడం, తుఫాను అప్పుడు ప్రజలకు ముందే హెచ్చరించి రక్షిత ప్రాంతాలకు తరలించడం వంటిది ఈ ఉపద్రవాలకు కొంత నివారణగా పనిచేయవచ్చు. కానీ పూర్తిగా నష్టాన్ని తొలగించలేము.

చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టుగాక, ముందే దూరదృష్టితో పరిశీలించి తగు నివారక చర్యలు ప్రారంభిస్తే అది లాభదాయకమే. అయినా ప్రథమంగా ప్రకృతి సమతౌల్యతను పరిరక్షించుకోవడం, జనాభాను అదుపులో పెట్టుకోడం అనేవి మన ముఖ్య కర్తవ్యాలు.

* * *

ఇ. కృష్ణచైతన్యరెడ్డి, ఖాజీపేట్.

ప్రకృతి అనేది భగవంతుడు మానవులకు ప్రసాదించిన వరం. అనాదినుండి కూడా మానవుడు ప్రకృతిపైనే ఆధారపడి జీవనం సాగిస్తున్నాడు. కానీ ప్రకృతిలో సంభవించే కొన్ని ఉపద్రవాలు మానవుని అభివృద్ధికి ఆటంకాలుగా తయారవుతున్నాయి. ఈ ఉపద్రవాలను ప్రపంచంలో ఏ శక్తి ఆపలేదు. కానీ రాబోయే విపత్తులను ఆధునిక విజ్ఞాన శాస్త్రాభివృద్ధుల సహాయంతో ముందుగా గ్రహించి వాటి బారినుండి బయటపడవచ్చు.

భూకంపాలు, అగ్నిపర్వతాలు ప్రేలడం అనేవి భూమి అంతర్భాగంలో జరిగే క్రియలు. భూకంపాలవల్ల తీవ్రమైన ఆస్తి నష్టము, ప్రాణనష్టము సంభవిస్తుంది. భూకంపాలను ముందుగా తెలుసుకుని ప్రమాదంవల్ల జరిగే నష్టాన్ని నివారించుకోవాలి.

"నింద వేయడం, అబద్ధం చెప్పడం కంటే ఘోరం. అది అబద్ధాన్ని దాచే బురఖా."
—పోప్

భూమి ఉపరితలంపైన వాతావరణంలో సంభవించే మార్పులవల్ల తుఫానులు, ఉప్పెనలు, వరదలు, కరువులు, కాటకాలు ఏర్పడుతూ ఉంటాయి. తుఫానుల రాక ముందుగా తెలుసుకుని తగు జాగ్రత్తలు తీసుకోవాలి. నదీపరీవాహక ప్రాంతాలలో చెట్లను పెంచి వరద ప్రవాహ వేగాన్ని తగ్గించి కష్టాలను కొంతవరకు నివారించుకోవచ్చు.

ప్రకృతిని మనం కాపాడితే అది మనలను కాపాడుతుంది.

* * *

కుమారి కె.ఎల్. శశికళ,

అనంతపూర్.

ప్రకృతి శాసనానికి తిరుగులేదు. ప్రకృతి కరుణిస్తేనే అన్నీ సాఫీగా సాగిపోతాయి. ప్రకృతిలో సంభవించగల అన్ని విపత్తులలో అత్యంత భీభత్సమైనది భూగర్భంలో కొన్ని మైళ్ళ లోతున ఉన్న రాతి పొరలమధ్య ఘర్షణ ఏర్పడినప్పుడు ఆ రాపిడివల్ల ఉత్పన్నమయ్యే ఉపద్రవమే భూకంపము ప్రకంపనల ప్రభావంవల్ల జనసందోహంతో కళకళలాడుతున్న నగరాలు, గ్రామాలు క్షణాలలో శ్మశానాలుగా మారిపోతాయి.

విస్తారంగా వర్షపాతంగల సంవత్సరాలలో నదులు పొంగి వరదలు కలుగజేసి కష్టనష్టాలకు కారణభూతము లవుతున్నాయి. వరదలవల్ల, అధిక వర్షంవల్ల చెరువులు గండ్లుపడడం, మురుగు కాల్వలు దెబ్బతినడం, గట్లు తెగిపోవడం, అనేక వ్యాధులు సంభవించడం, సారవంతమైన భూములు కొట్టుకుని పోవడం మొదలైన ఉపద్రవాలవల్ల అనేక నష్టాలు కలుగుతున్నాయి. ఏళ్ళ తరబడి అనావృష్టితో సతమతమవుతూ త్రాగునీటికికూడా నోచుకోనివారవుతున్నారు. ఇటువంటి ఉపద్రవాలకు తగిన ముందుజాగ్రత్తలు తీసుకోవాలి.

భూకంపాలవంటి ఉపద్రవాలకు భూగర్భ పరిశోధక కేంద్రాలు ప్రతిరోజూ 24 గంటలూ సర్వే జరుపుతూ జపానులో దేశవ్యాప్తంగా నివారక చర్యలు తీసుకుంటున్నారు. అంటు వ్యాధులు ప్రబలిపోకుండా ఆరోగ్యశాఖ తగు చర్యలు తీసుకోవాలి అధిక వర్షాలవల్ల సారవంతమైన భూమి కొట్టుకుపోకుండా కాపాడాలి. దానికి చెట్లను నాటి పెంచాలి.

## కొత్త తోకచుక్క కనిపించింది



సోవియట్ యూనియన్ కజకస్తాన్‌లో ఖగోళశాస్త్రజ్ఞులు మకరరాశిలో ఇటీవల ఒక క్రొత్త తోకచుక్కను కనిపెట్టారు. ఇది హేలీ కక్ష్యవంటి మరో కక్ష్యలో తిరుగుతూంది. ఇది భూమికి 300 మిలియన్ కాంతి సంవత్సరాల దూరంలో ఉంది.

"గొప్పదనం ఎప్పుడూ నిరాడంబరతని పోలి ఉంటుంది. ఈ రెండింటి మధ్య గల భేదం అతి స్వల్పం."
—ఎమర్సన్

# పోటీలు

జనవరి 1989

'విజ్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుతావు సైజుకు తగ్గని కాగితంమీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించ బడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15 లు, రూ. 10 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకే సారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జనవరి 20, 1989. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విజ్డమ్' 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

— సంపాదకుడు

## వ్యాసం

"మారుతూన్న కుటుంబ వ్యవస్థ - వృద్ధులు" అనే అంశంమీద 200 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసిపంపండి.

## క్విజ్

1. క్రిందివాటిలో ఏది కృష్ణదేవరాయలుకి సంబంధించదు?

(ఎ) దక్షిణ ఇండియా చివరి గొప్ప హైందవ పాలకుడు, (బి) విజయనగర సామ్రాజ్య స్థాపకుడు, (సి) గొప్పయోధుడు మరియు పరిపాలనాదక్షుడు, (డి) గొప్ప పండితుడు.

2. క్రింది నదులలో ఏది అరేబియా సముద్రంలోకి ప్రవహిస్తుంది?

(ఎ) మహానది, (బి) గోదావరి, (సి) మాండ్వి, (డి) కృష్ణా.

3. విటమిను 'సి' ఇందులో పుష్కలంగా లభిస్తుంది:

(ఎ) కాడ్ లివర్ ఆయిల్, (బి) వెన్న, (సి) గ్రుడ్డు, (డి) నిమ్మ.

4. క్రింది వారిలో ఎవరు భారతదేశపు రెండవ ఫీల్డ్ మార్షల్‌గా ఉన్నారు?

(ఎ) పి.పి. కుమారమంగళం, (బి) కె. ఎమ్. కరియప్ప, (సి) ఎ. ఎస్. వైద్య, (డి) ఎస్. హెచ్. ఎఫ్. జె. మానక్‌షా.

5. ఇన్సులిన్‌ను స్రవింప చేయునది ఏది?

(ఎ) లివర్, (బి) పెప్సిన్, (సి) థైరాయిడ్, (డి) పాంక్రియాస్.

6. ప్రపంచంలో ఏ దేశంలో మత సంబంధమైన కలతలు సివిల్‌వార్‌గా పరిణమించింది?

(ఎ) ఇరాన్, (బి) ఇరాక్, (సి) లెబనాన్, (డి) భారతదేశము.

7. 'ఆపరేషన్ బ్లాక్‌బోర్డు' దేనికి సంబంధించింది.

"ముళ్ళ చెట్టును మొక్కగా ఉన్నప్పుడే ఛేదించు.
పెరిగిన తరువాత అది నిన్నే ఛేదిస్తుంది."

(ఎ) మిలటరీ ఎక్సర్‌సైజు, (బి) పాల ఉత్పాదన, (సి) అడవిజంతువుల సంరక్షణ, (డి) బోధనా పద్ధతులలో అభివృద్ధి.

8. ఏ విటమిను లోపంవల్ల 'రేచీకటి' (night blindness) సంభవిస్తుంది?

(ఎ) A, (బి) B. (సి) C, (డి) D.

## పజిల్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | X | 3 | | | 4 |
| | X | X | 5 | | | X | X | |
| | X | 6 | | X | | X | X | |
| 7 | 8 | | X | 9 | | 10 | | |
| X | | X | 11 | | X | | X | X |
| 12 | | | | X | 13 | | | 14 |
| | X | X | 15 | | | X | X | |
| | X | X | | X | | X | X | |
| 16 | | | | X | 17 | | | |

ఆధారాలు-అడ్డం 1. ఐశ్వర్యమును కలిగించునది, 3. సంగీతమునకు సంబంధించిన ఎనిమిది పురుష రాగములలో ఒకటి, 5. నేల ఇలా ఉంటే నడిచేటప్పుడు జారి పోవచ్చు, 6. భార్య, 7. విడువకుండా కురిసే వానజల్లు, 9. తాంబూలము ఏహావచన రూపం, 11. భారతదేశంలో విస్తారంగా పండే సస్య విశేషము, 12. ధ్యానము అను అర్థమువిచ్చే మాటలో అక్షరాలు మారాయి, 13. స్వర్గము కాదు అనేమాటలో అక్షరాలు చెదిరాయి, 15. భగవంతుడు, 16. స్త్రీల సమూహము అనుమాటలో చివరి రెండు అక్షరాలు తారుమారైనాయి, 17. అందముగా.

నిలువు 1. జాబులు దీనితో ప్రారంభమవుతాయి, 2. వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు, 3. పట్టణంలో ఒక విభాగము, 4. శృంగార విలాసములు, 6. అయిదు ఒకటి, 8. పుష్పము అని అర్థమిచ్చే కుసుమము, 9. మాగావిభూమి, 10. మేషము, వృషభము మొదలైన రాశుల ఉదయము, 11. తోటకు దివ్యపాలకురాలు, 12. ద్వేషము, 13. లోభి ఖర్చుచేసి ఇలా తినలేడు, 14. కొందరు వ్యాపారస్థులు అరువు ఇవ్వరు, ఇలాగే అమ్ముతారు.

### 1990 [illegible]

[illegible]

"హంస నడకలు కాకికి తెలియనట్లు, జ్ఞాని దృష్టికీ అజ్ఞానిదృష్టికి వ్యత్యాసం, తూర్పు పడమరలంత."

## తెలివికి పరీక్ష

1. ఈ క్రింది వాక్యములో 'అర' వ్యవహారరీతిగా ఎలా ఉపయోగించబడుచున్నది?

(ఎ) బాగుగా క్రాగిన పాలు కమ్మన, (బి) పూర్తిగా పండిన పండ్లు తీపి, (సి) తృప్తిగా తిన్నవానికి ఆకలి ఉండదు, (డి) పూర్తిగా చూచి లేదంటావేమి?

2. అష్టాంగ ప్రమాణములలో చెప్పబడే ఎనిమిది అంగములు ఏవి?

3. 'గీతగోవిందము' అనే గ్రంథము వ్రాసినవారెవరు? దానికి మరోపేరు ఏమిటి?

4. ' త్త పీ నా ము భా చి ము గ్య ' దీనిని అర్థవంతంగా వ్రాస్తే త్యాగరాజు పాట పల్లవి ప్రారంభమవుతుంది.

5. ఈ క్రిందివరుసలో తరువాతి సంఖ్య ఏది?

2 3 5 9 17 33 ___

6. ఈ క్రింది వాక్యములలో 'తల' వ్యవహార రూపంలో ఎట్లు ఉపయోగించబడుతూంది

(ఎ) నాలుగు డబ్బులు చేరగానే గర్వం ఎక్కువైంది, (బి) ఈవేళ పండుగ కావున శ్రీనాథుడు అభ్యంజనం చేసాడు, (సి) ఆఖరి కూతురి పెళ్ళిచేసి తండ్రి కార్యభారం తగ్గిందని ఆనందించారు, (డి) చంద్రుడు అందరికీ గౌరవపాత్రుడుగా ఉంటున్నాడు.

7. నలందా విశ్వవిద్యాలయం ఎవరిచే ఎప్పుడు స్థాపించబడింది?

8. ఈ క్రింది తెలుగు పదాలకు ఎక్కువగా వాడుకలో ఉన్న ఉర్దూపదాలు ఏమిటి?

## విజయమ్
### పోటీల ఫలితము
జనవరి 1989

(ఎ) బలవంతం, (బి) విసుగు, (సి) ఏర్పాటు, (డి) న్యాయస్థానము.

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని అర్థాలను సూచించండి.

1. ఉత్త: వట్టిది (ఎ), కేవలము (బి), అసత్యము (సి), ముఖ్యము (డి).

## వాస్తవిక దృష్టితో యోచించు

[illegible]

"ఎంత మంచి పనైనా కాస్తంత శ్రమ లోపించడంవలన విఫలమౌతుంది." —ఇ. హెచ్. హారిమన్

## విపులా
### పోటీల ఫలితాలు
**జనవరి 1989**

2. **అరటు:** బాధ (ఎ), సంతాపము (బి), కలుగు (సి), వైరము (డి).

3. **అరడి** బాధ (ఎ), దుఃఖము (బి), హాని (సి), అపవాదము (డి).

4. **ఇల్లాలు.** భార్య (ఎ), స్త్రీ (బి), ఈగు (సి), ఉయ్యేల (డి).

5. **ఉరవడి** మిక్కిలి వేగము (ఎ), పరాక్రమము (బి), వలలో చిక్కు (సి), అనుకూలము (డి).

6. **ఊసు:** కాలక్షేపమగు (ఎ), ఊహలు (బి), చవిటినేల (సి), కృశించు (డి).

7. **ఎల:** కోమలము (ఎ), అభినవము (బి), స్వల్పము (సి), స్త్రీ (డి).

8. **ఒగ్గు** అడ్డముగా జూచు (ఎ), పట్టు (బి), ఒడ్డు (సి), విల్లు (డి).

## ముఖ-చిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసిపంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'వివేకి దేశాటనం చేస్తే అవివేకి దేశసంచారం చేస్తాడు' అంటే మీరు ఏం అంటారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## 156 దేశాలలో 9 మిలియన్ మంది భారతీయులు

ప్రపంచం అంతటా 156 దేశాలలో 9 మిలియను మంది భారతీయులు [illegible] వీరిలో 8 వ వంతుకు పైబడి [illegible] మంది మలేషియాలో [illegible] శ్రీలంకలో 10,27,2[illegible] [illegible] 8,60,000 మంది [illegible] 7,80,000 మంది, [illegible] 6,98,000 మంది, [illegible] 6,00,000, [illegible] 3,39,840, [illegible] 2,50,000, [illegible] 1,02,000 [illegible] 1,02,[illegible] మంది [illegible] 10,000 మంది [illegible] 7,048 [illegible] 2,970, [illegible] 2,685 మంది.

"ఒకటి అనుకున్నప్పుడు మరొకటి జరిగితే మనల్ని మించిన దేవో ఉన్నాడనిపిస్తుంది."

—అను

# పోటీలు - ఫలితాలు

(నవంబరు 1988)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి. కత్తురోజు నరసింహాచారి, హైద్రాబాద్; రెండవ బహుమతి వారణాశి పాపయ్యశాస్త్రి, విజయనగరం; మూడవ బహుమతి శ్రీమతి చిట్లా సువాణి, ఖమ్మం.

క్విజ్ - జవాబులు 1. జార్జి బెర్నార్డ్ షా, 2. నుస్సీ - షియా 3. నీల్ ఆర్మ్ స్ట్రాంగ్. ఎడ్విన్ ఆల్ డ్రిన్. 4. (డి)స్విట్జర్ లాండ్ 5 10. డౌవింగ్ స్ట్రీటు, 6. పిల్లి, 7. ఉండదు. ఇది శిక్కుకు ప్రశ్నామ్యాయం, 8. రంజీట్రోఫీ.

విజేతలు - రెండవ బహుమతి. కె. కాళిదాసు. తొగరాం, (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: ఎన్. భరత్ కుమార్, విజయవాడ.

పజిల్ - జవాబులు - అడ్డం 1. ఆరోగ్యమే మహాభాగ్యము, 5 మిమిత ఖారసపా 6. స్త్రృవితి, 7. గాముయవివ, 9. కిన్నెరసాని. 10. విలాసం 12. ఆవిరి, 13. ముక్కాలిపీట, 14. విహితం.

నిలువు. 1. ఆత్మ విస్తృతికిమూలము, 2. మేషము, 3. హావభావము, 4. ముక్తి సాధన, 5. మితిమీరవిగాలి. 7. గావిలుఆట, 8. విమలా, 10. విరివి, 11. సంగీతం.

విజేతలు - మూడవ బహుమతి: దశిక కృష్ణమోహన్, వరసాపురం, (ప.గో. జిల్లా)

తెలివికి పరీక్ష - జవాబులు: 1. 64.128, 2. రాయప్రోలు సుబ్బారావుగారు, 3. (ఎ) పగులగొట్టు, (బి) తెలియజేయు, (సి) అరగదీయు, (డి) కాగబెట్టు, 4. కటకమున అధిపతియగు ప్రతాపరుద్ర గజపతి కుమార్తె, విజయనగర సామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవరాయల దేవేరి, 5. 'ఎయిర్ ఇండియా' అంతర్జాతీయస్థాయిలో

**ఒరుగుతున్న పీసాటవరు**

ప్రపంచపు వింతలలో ఒకటైన ఇటలీ పీసాలోని 815 సంవత్సరాలనాటి వాలుతున్న తెల్లరాతి పీసాటవర్ ఒరుగును ప్రతి సంవత్సరం కొలుస్తుంటారు. 1985 వ సం.లో ఈ ఒరుగు 2 మి.మీ. పెరిగింది. ప్రస్తుతం ఈ టవర్ లంబానికి 5.1 మీటర్ల ఒరుగులో ఉంది.

"అనురాగం అనే బంగారు గొలుసు
సమాజం బంధింపబడి ఉంటుంది."

అన్ని ఖండాలకు వైమానికసేవ కలిగిస్తుంది. 'ఇండియన్ ఎయిర్‌లైన్' ఇరుగు పొరుగు దేశాలతోపాటు దేశంలో వైమానికసేవ కలిగిస్తుంది, 6. 12 మంది, 7. భూత, భవిష్యత్. వర్తమాన కాలాలు, 8. పీఠి.

విజేతలు - మూడవ బహుమతి. దశిక కృష్ణమోహన్, నరసాపురం (ప గో. జిల్లా)

మాటల మహిమ - జవాబులు. 1. తారతమ్యము (ఎ). భేదము (బి), ఆధిక్యము (సి), ఔన్నత్యము (డి); 2. పర్యాయము (ఎ), 3 మూఢుడు (ఎ), ఉన్మత్తుడు (బి), అర్థములేనిది (సి), 4. కొరత (ఎ); 5. సంవత్సరము (ఎ), సన్నని వస్త్రము (బి), కాలువ (సి); 6. సమృద్ధి (ఎ), అతిశయము (బి), విశేషము (సి), సౌందర్యము (డి); 7. మనోవలయము (ఎ), తపస్సు (బి), ముగింపు (సి), అభివివేశము (డి); 8. తగిన సమాధానము (ఎ), పోలిక (బి), పాటి (సి).

విజేతలు - మూడవ బహుమతి. ఎస్. భరత్‌కుమార్, విజయవాడ.

ముఖచిత్ర వ్యాఖ్య - రెండవ బహుమతి: పీల శ్రీనివాస్, మిరుదొడ్డి (మెదక్ జిల్లా); మూడవ బహుమతి. పి. శ్రీనివాసులు, బోర్లం, (నిజామాబాద్ జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి: డి. జి శంకరశ్రీనివాస్, గంగ చోళ్ళపెంట, (విజయనగరంజిల్లా); మూడవ బహుమతి వాసా రామలింగేశ్వరరావు, రామచంద్రపురం, (ప గో. జిల్లా)

మీరైతే ... ? - రెండవ బహుమతి: డి. లక్ష్మణచారి, హైద్రాబాదు.

( 3 వ పేజీ తరువాయి)

గీమకుని మమకారాన్ని పెంచుతున్నా జగత్తు ఈ 'గీతలను చెరిపివేసి 'నేనంతా ఒకటే' అంటుంది.

ధనవంతులు నిరంతరం తమ ధనాన్ని పోగొట్టుకుంటూంటే, దరిద్రులు నిరంతరం దానిని సంగ్రహించుకుంటారు. నేటి ధనవంతుడు రేపటి దరిద్రుడు. ఇలాగే నేటి పేద రేపటి ధనాఢ్యుడు

హృదయం నుంచి 'నేను'ను ఖాళీ చేయిస్తే హృదయం మధుర ప్రేమతో, మంచితనంతో నిండిపోతుంది. విశ్వాన్ని నడిపించే మహత్తర ధర్మమాత్రాన్ని అవగాహన చేసుకుంటే ద్వేషం, క్రోధం, ఆశ అధిగమించి తమ కేది ప్రాప్తమో అది లభిస్తుందని తెలుసుకుంటారు

భయం మానవులను నీడలా వెంటాడుతుంది. స్వార్థ పరాయణతతో 'నాది' అనే భావంతో ధనం సంపాదించుకునే వ్యక్తికి పదిలం ఉండదు. భయపడిపోతూ ఉంటాడు. సదా లౌకిక సుఖాలను అన్వేషించేవారు దారిద్ర్యం ఎప్పుడు పట్టుకుంటుందో అని భయపడి పోతూంటారు. ఈ ద్వంద్వ ప్రపంచంలో జీవయాత్ర సాగించే వారందరికీ ఒకటే భయం. మరణ భయం. అందరినీ వెంటాడుతూంటుంది ఈ మరణం.

"ఏ విధంగా మనిషి ఆకలి తీరడానికి ఆహారం తీసుకుంటాడో,
ఆ విధంగానే భగవంతుని దయ సంపాదించడం అనే కోరిక

EDITED, PRINTED AND PUBLISHED BY K V GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd Madras-14 (Ph : 848084*

